శ్రీరస్తు.

# శకుంతలాపరిణయము

కృష్ణకవిప్రణీతము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1916.



శ్రీరస్తు

# శకుంతలాపరిణయము

## పీఠిక.



వత్సాంకలసద్భుజాంతరగతశ్రీయోరుహారాగ్రరే
ఖావిశ్రాంతి నెసంగుతత్కుచతటిన్ గైసేయు కాశ్మీరసం
భావంబుల్ తనమైఁ బొసంగ నలమేల్మంగాభిధానందిరా
దేవిం గౌఁగిటఁ జేర్చు వేంకటపతిన్ ధీయుక్తిఁ గీర్తించెదన్. 1

ఉ. ధీనిరవద్య హృద్యనిరతిన్ హరితోధరితోత్సవంబులన్
బూనుకడాలి బొమ్మకలుముల్ వెలుముల్గలముగ్ధుగుమ్మస
న్మానిమనోవిహారిణి కుమారివాణీమణి భూరిసూరిస
న్మానముఁ బొర్పుఁగాత గిరిజన్ నెఱిమంజుల మైనమత్కృతిన్. 2

ఉ. పుంఖితశత్రుకర్ణములు భూరివిరోధిశిరోఘనులం జవ
ప్రేంఖదరాతిమస్తములు విద్విషదంబులు సంగదానశీ
రింఖవరప్రవేష్టములు ప్రేలఁగ లీల నెసంగు దైత్యభి
చ్ఛృంఖముఁ జక్రమున్ గదయు శార్ఙ్గము ఖడ్గము మమ్ముఁ బ్రోవుతన్. 3

క. భాసురసూరిగ్రామణి, భూసురముఖపంకరుహాంభోమణివిసమ
ద్వాసనిచయచింతామణి, నే సంగరిగురుశిఖామణిం గణుతింతున్. 4

తే. సోమునఁ బసఁ దిక్కనసోమయాజి, భీము శ్రీనాథు భాస్కరుఁ బెద్దనార్యుఁ
బోతనామాత్యు నాదియౌ బొలుపుఁగాంచు, నాంధ్రకవితానిశాంతుల నభినుతింతు.

ఉ. శ్రీరమణీధవార్పితము సేయుకృతిన్ బ్రతికూలవృత్తిమై
క్రూరవచోవికారములఁ గుందగునట్టిని చూడ్కిఁ జూచి వే
సారుమ సారదూఱుచుఁ గుతెంకులఁ బోవకుఁ డెన్నలార! మీ
పేరుపు లవ్యకావ్యసరణిన్ బుగణింపఁగఁ జేయు టొప్పగున్. 6

వ. అని యివ్విధంబున నిష్టదేవతాప్రార్థనంబును గురువందనంబును సుకవిభూషణంబునుం గుకవిదూషణంబునుం గావించి యొద్దియేనియు నొక్క ప్రబంధంబు రచియించి మదిష్టదైవతంబునకు నంకితంబు గావింపం దలంచునవసరంబున. 7

సీ. ఏమహాత్ములపుట్టినిల్లు బ్రహ్మాదులు, శిరసావహించి పూజింతు రెలమి
వేదయాహ్యదయముల నైదోడుజగములఁ, ద్రిస్రోతయై పవిత్రీకరించు
నెవ్వారిశుశ్రూష నేకొలంతయు లేక, వసుధాసుధాశనవ్రతము లెసఁగు
నేమహామహులసంగ్రామసామర్థ్యంబు, పార్థివోత్తములకుఁ బట్టుఁగొమ్మ
తే. వారు దుర్వారగర్వాపివముఖరముఖ, శత్రుజత్రుక్షితిక్షురక్షతజకృతజ
యార్హచర్చాసమర్చితోగ్రాసిలసన, భాసురభుజోర్థవిభవులు పాదభవులు. 8

కం. ఆపాదభవులలోపల, నాపాదితదివ్యగుర్వ్యలార్యలవార్యుల్
ప్రాపితధనకనకాంబర, గోపాయితకవులు పైఁడికులగోత్రభవుల్. 9

కం. ఆరసికులలోఁ బెద్దన, గారనఁగా రూఢదీపకళికావిలస
ద్ధోరణి సిద్ధారిణిఁ దగు, కారుణికులలోనఁ బరమకారుణికుండై. 10

కం. పెద్దనఁగారావేలుపుఁ, బెద్దనఁగారంతిభాతి భృతవైభవుఁడై
పెద్దనఁగా రాజూరుల, పెద్దనఁగారాచ మెచ్చుబిరుదముఁ దచ్చెన్. 11

ఉ. సన్నుతకృష్ణరాయనృపసత్తముచిత్తము రాఁ జరించుచున్
మన్నన మీఱఁ భూరిబహుమానముగాఁ గజరాజరాజిఁ గై
కొన్నఘనుండు పైఁడికులగోత్రపవిత్రచరిత్రుఁ డార పె
ద్దన్నసిరుల్ సరుల్ పొగడ నక్కడ నిక్కడ నెక్కుడై తగున్. 12

సీ. వహిమాకేటూరియిమ్మడి తిమ్మలకుమారి, సింగరార్యులప్రియశిష్యుఁ డగుచు
నాచార్యపదభక్తి యాశ్రితావనరక్తి, గలిగినౌదార్యదాక్షిణ్యుఁ డగుచు
రాయలరాజకార్యములందు నిరతుఁడై, ప్రాజ్యసామ్రాజ్యసంధరతుఁ డగుచు
ధనధాన్యకటకమై తనయిల్లు వర్ధిల్ల, ధాత్రీసురత్రాణపతుఁ డగుచు
తే. నవనిధానంబులనిభాద్యనవద్య, పద్యగద్యావధానసన్నద్ధనవ్య
కావ్యసంభావ్యభవ్యసంగ్రామవిజయ, బిరుదుఁ డగుచిటుమామిళ్లపెద్దశౌరి. 13

ఉ. మానితమూర్తియైన చిటుమామిళపెద్దనృపాలమౌళికిన్
సూనుఁ డొరుండు గల్గె నఘసూదనపాదనవస్రక్ప్రియాపరుం
డానతశత్రుజాలుఁడు నయానయనిర్ణయశీలుఁ డుత్తమ
జ్ఞానఘనుండు తిమ్మనృపసత్తముఁ డుత్తముఁ డిమ్మహిన్ రహిన్. 14

పంచచామరము. ధరాధరాధరాహివర్యధైర్యగుర్యవిట్ఛ్రుత
స్ఫురత్తరత్తరత్విభప్రభూతకాంతిహేతికా

విగోధిరాడ్విరోధిరాజి శ్రీలహోలిసల్పునా
స్థిరామరామరాగుఁడైన తిమ్మభూవిభుం డనిన్. 15

తే. తిమ్మనృపతికిఁ బట్టపుదేవివలన, సురుచిరాకారులిరువురు సుతులు గలిగి
రగ్రజుఁడు వేంకటాద్రీంద్రుఁ డవరజుండు, భవ్యగుణశాలి రామభూపాలమౌళి. 16

సీ. బలరామ రఘురామ పరశురాములతోడ, విక్రమంబునమాద్రి వేంకటాద్రి
ద్విజరాజ ఫణిరాజ దిగిభరాజులతోడ, విశదకీర్తులమాద్రి వేంకటాద్రి
యినజాత వనజాత ఘనజాతములతోడ, వితరణంబున మాద్రి వేంకటాద్రి
భారతీశ సతీశ భార్గవీశులతోడ, విన్నాణమున మాద్రి వేంకటాద్రి

తే. ధారుణి భరించి విబుధుల గారవించి, సురుచిరసువర్ణపూర్ణత సొబగుమించి
యగణితోచ్ఛ్రాయమున దివ మాక్రమించి, వెలయు హేమాద్రితో మాద్రి వేంకటాద్రి.

సీ. దినదిన దీనార్థిజన ప్రీణనంబున, కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ
నిత్యసత్యవ్రతనిష్ఠాగరిష్ఠత, కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ
సౌశీల్య వాత్సల్య సాకల్యకల్యత, కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ
సౌందర్యగాంభీర్యచాతుర్యధుర్యత, కన్నపూర్ణాదేవి కన్నపూర్ణ

తే. వరకవుల వేలుపులగడ్డ వాసిరెడ్డి, పద్మనాభునితోఁ బుట్టుపడఁతి యగుట
కన్నపూర్ణమహాదేవి కన్నపూర్ణ, మహితసద్గుణనికురుంబ మాచమాంబ. 18

క. ఆమాచమాంబవలనఁ బ్ర, ధామహితుఁడు వేంకటాద్రితనయుం గనియెన్
సోమధరస్తోమ శర, వ్యోమసదాకీర్తి నూర్జితమూర్తిన్. 19

క. వేంకటనాథుం డొసఁగిన, సంకల్పఫలం బటంచు జననీజనకుల్
వేంకటపతినామంబున, నంకితుఁ గావించి రతని నాశ్రితరతునన్. 20

క. శంకాతంకానంకా, హంకారసాహసశౌర్యఖ్యాతుం డై
వేంకటపతి ఖ్యాతిమీరెను, వేంకటపతి యనఁగ జగతి వినుతికి నెక్కెన్. 21

క. ఆవేంకటపతినరపతి, దేవి రహిం బాపమాంబ దినదినమాన్యా
దేవిని శ్రీదేవిని వా, గ్దేవినిఁ బూజించు వసుమతిన్ సుమతియనన్. 22

ఉ. నేరుపుమీఱఁ బుట్టినిలు నీరును గేలును గాఁగఁబట్టిరా
మారునిఁగన్న తల్లి గుఱుఁ గుమారినితల్లియు సాటివత్తురే
భూరితరవ్రతాచరణఁ బుట్టినయింటికి నెన్నకీర్తినిన్
దారుణమున్ దిగద్రొక్కి నెఱపైతెగు పాపమాంబకున్. 23

చ. పటుగతిఁ బాపమాంబకును బ్రాభవవైభవశాలియైన వేం
కటపతికిన్ దనూభవులు గల్గిరి నల్వురు విక్రమక్రమో
ద్భటరిపుహారి జగ్గనరపాలుఁడు రామనరేంద్రుండు మా
చటమాదనుండు పెద్దశివరామ నరాధిపతి వేంకటాఖ్యుఁడున్. 24

మహాస్రగ్ధర. పరవైరించ ప్రపంచావరణమున యశోవ్యాజని జాంకులొప్పం
జెరుమామిళ్లాన్వవాయాంచితజలనిధికిఁ శీతభానుండు వోలెఁ
బరఁగుఁ జగ్గక్ష్మామహేశ్వరుఁడురుతరసంపన్నిధానుండు దానా
పరశానీమండు బాహాబలచరితజగత్ప్రాణుఁడై రాణమీఱున్. 25

తే. పావనీసత్సంప్రదాయంబునందు భాగ్య, చిహ్నములతోడ నుదయించె శీలవృత్తి
నియమములమేటియగుభవానీఁబూటి, భార్యగానేలె జగ్గభూపాలకుండు. 26

మ. నిరతిఁ జగ్గనృపాలమౌళికి భవానీదేవికిం గాంచనాం
బరుసన్నుఁ సిరిగన్నయన్న శివరామక్షోణినాథుండు ని
ర్భరఘోరప్రతివీరపాలవాలమా పట్టాభిరామప్రభుం
డరుదౌ వేంకటశౌరివాఁగలిగిరూపాఁ మువ్వురాత్మోద్భవుల్. 27

వ. అందు. 28

సీ. తనదానమర్థులొందినఁ గాఁకఁ జూపక, మిత్రభావంబున మెలఁగునేనిఁ
దనభోగ మెరులు మీఱిన వెచ్చనూర్పక, తా నజిహ్మగలీలఁ దాల్పునేనిఁ
దనవారి నోరులు వేఁడిన నైనవీడక, ఘనవృత్తి భువనమ్ము మనుమ నేనిఁ
దనధర్మ మెరులఁ బూనిన డోలఁపడనీక, సమదృష్టి మోదమ్ము సలుపునేనిఁ

తే. దేజమునఁ జిత్రభానుండు ధృతి నహీనుఁ, డీవి ఘనమూర్తిగిరిను మాహేశ్వరుండు
సాటిరాఁదగునాశ్రితశ్రమపరోధ, శరణి కిచ్చిఁశివరామధరణిపతికి. 29

క. రమణాంబను లక్ష్మాంబను, గ్రమమునఁ బాణిగ్రహణము గావించి నృపో
త్తముఁ డయ్యిరువురవలనం, గొమరుల నిరువురను గాంచి కూర్మివహించెన్. 30

వ. అక్కుమారయుగళమ్మునందు. 31

తే. రమణమాంబాత్మజుఁడు బలరామనృపతి, లక్ష్మణాంబాసమేతుఁడై లలి వహించె
నచ్చమాంబాసుతుఁడు పార్వతమ్మతోడఁ, బ్రబలుఁడై యొప్పె వేంకటరామనృపతి.

క. చినశివరామసుధీమణి, యనుజుఁడు పట్టాభిరామయాగ్రణి లక్ష్మాం
బను బెండ్లియాడి క్రమమునఁ, దనయచతుష్కంబుఁ గాంచి ధాత్రి రహించెన్. 33

సీ. రంగమాంబామనోరాజీవమిత్రుఁడై, శరమొప్పు రఘునాయకప్రభుండు
వెంకమాంబాగుణాలంకారకలితుఁడై, రాణించు వేంకటరామవిభుఁడు
బుచ్చమాంబాపరిస్ఫురితోపభోగుఁడై, మహిమంబుఁ గాంచులక్ష్మణవిభుండు
చినరంగమాంబికాశ్రేంగావిభవంబుఁ, గాంచుకుమారజగ్గక్షితీశుఁ

తే. దబ్జభవుశాసనముల వియ్యంబుగాంచి, వేదములతోడ నెయ్యమ్ము విస్తరించి
ప్రబలెఁబట్టాభిరామభూపాలసుతచ,తుష్టయము పేర నబ్ధిచతుష్టయంబు. 34

తే. అవనిఁబట్టాభిరామన్నఁ యనఁగుఁదమ్ముఁ, డాశ్రితామరధాత్రీరుహమ్ము శత్రు
కాలకూటము మిత్రసుధాలవాల్య మొలిఁ దనరారు వెంకభూపాలకుండు. 35

క. ఆవెంకక్షితిపతిరహి, గావిలసిలువెంకమాంబికాసతివలనన్
ధీవిహితునాయుఁడమ్మనఁ, గావిశ్రుతిఁగాంచుతనయుఁ గాంచి రహించెన్. 36

తే. పార్వతీనామముననేత్రపర్వమైన, బాలికామణిఁ బెండ్లియై హాళిఁ దనరె
నాసగొనుసర్వసర్వంసహామరులకు, నవసుధాసారములతిమ్మ నాయఁడమ్మ. 37

వ. ఆకూటస్థు లగునలువురిలో నగ్రజుం డగుజగ్గక్ష్మాపాలకువంశప్రకారంబు వివరింపంబడియె వెండియు. 38

శా. ఆజగ్గక్షితిపాలుతమ్ముఁ డలరున్ హంవీరవీరాసిధా
రాజీర్యద్రిపురాజి మేళనలలద్రంభాదికాద్యప్సరః
కూజత్కంకణకింకిణీఘణఘణాఘోషానుస్ఫురద్వ్యద్ధసీ
మాజాగ్రత్తురగుండు పెద్దశివరామక్షోణిపాలుం డిలన్. 39

కవిరాజవిరాజితము. సదయవిచారుఁడు నారదపారదశారదనీరదహీరదర
త్నదమలకీర్తివిహారుఁడు ధీరుఁ డుదారుఁడు శూరుఁ డభీరుఁ డనన్
బదిలుఁడు శశ్వదనావిలకేవలభావలతావలనాకలనన్
బెదశివరామసుధీమణి యాశలఁ బేశలకౌశలుఁడై చెలఁగున్. 40

తే. సంశ్రితసురద్రువల్లి యోషామతల్లి, బంధుజనసింధుసరణిసంపదలధరణిఁ
బరగు పెదశివరామభూపాలుదేవి, భూరిసద్గుణనికురుంబ బుచ్చమాంబ. 41

ఆ. ఎలమిబుచ్చమాంబవలనఁ దనూభవ, పంచకంబుఁ బడసెఁ బంచశరుని
బాణపంచకంబుభాతి శ్రీపెదశివ, రామవిభుఁడు భాగ్యరాశియనఁగ. 42

చ. రతిపతికన్నమిన్న జయరామవిభుండు ఘనుండు వెంకన
క్షితిపతి సాహితీసలిలసింధుఁడు రామధరాధురంధరుం
డతిధృతిలక్ష్మణప్రభుఁ డుదారయశుం డగుచంద్రమౌళియ
ప్రతిభవులౌగ పెద్దశివరామతనూభవు లాత్తవైభవుల్. 43

వ. అందు. 44

క. అలజయరామసుధీమణి, వెలనొప్పఁగఁ బార్వతమ్మవలనఁ దనయులం
బలియురనిరువురఁ గాంచెన్, సులలితగతి వెంకవిభునినూరప్రభునిన్. 45

తే. వెంకమాంబాసమేతుఁడై వెంకధరణి, పాలతిలకుండుసిరులచేఁ బరిఢవిల్లె
బుచ్చమాంబాసమేతుఁడై భూరిసౌఖ్య, సంపదలఁగాంచె నూరనిలింపవిభుఁడు. 46

మ. జయరామప్రభుముద్దుతమ్ముఁ డురుదోస్సారుండు ధీరుండు ని
ర్భయుఁ డుగ్రాహవదోహలుండు విమలప్రాలేయబాలార్కుఁడ
వ్యయనారాయణపాదభక్తినిరతుం డావ్యెంకు రంగాంబికా
ప్రియుఁ డావెంకనృపాలచంద్రుఁ డిలఁ గప్పెన్ గీర్తియన్వెన్నెలన్. 47

శా. ఆ వెంకక్షితిపాలసోదరుఁడు రామాధీశ్వరుం డుల్లస
ల్లావణ్యంబునఁ గావ్యనాటకగుణాలంకారపారీణతా
ప్రావీణ్యంబున వాక్పటుత్వమున సద్భావంబునన్ విక్రమ
శ్రీవైయాత్యమునన్ బ్రసిద్ధుఁ డగుచున్ జెల్వారు నిద్ధారుణిన్.

సీ. తమ్ములయెడలనిత్యమ్ము నూపఁడుగాని, రాజకాంతులసాటిరాకయున్న
యిచ్చుచో గొణఁగి పెల్లగురకుండఁడుగాని, రసదమిగికసాటిరాకయున్న
సశరీరుఁడగుచు సాక్షాత్కరింపఁడుగాని, రతిరాజురహిసాటిరాకయున్న
కువలయామోదంబుఁ గూర్పఁజాలఁడుగాని, రవితేజమునసాటిరాకయున్న
తే. యాదరస్మితవదనునకీవదాన్య, మౌళికీనూపకాలికీమానితప్ర
తాపునకునంచుబుధులుచిత్తముల నెన్నఁ, బ్రబలు పెదశివరామన్న రామశౌరి. 49

సీ. ప్రథమాంశమునధర్మభంగముంకువగాఁగ, బాణిగ్రహణమైనపలువఁదనము
రాఁగూడదని పలుకు-రమణు వెంబడి నేగి, కానలోవిహరించుగడుసుఁదనము
మాయామృగము వెంట మగఁడుపోవఁగ దంట, నుఱఁదినంపినవాటిమంకుతనము
రావణాసురువీట రహిఁ బాసి నానాట, చెఱసాల నిలకొన్న చిన్నతనము
తే. హావణిఁదీర్పఁగఁ గ్రమ్మఱనవతరించి, పైఁడికులగోత్రమిద్ధాత్రిపాత్రముగను
జెలఁగు రామక్షమాపాలుఁ జెట్టపట్టె, ధీరధోరణి జానకీదేవితీవి. 50

తే. తీవిఁదనరాయజానకీదేవివలన, రామభూపాలతిలకుండు ప్రేమమీఱఁ
బడసె ముమ్వురఁ దనయులభరితనయుల, హరిహరాబ్జభవాంశమ్ములందువారి. 51

క. వెంకక్షితిపతియునశౌ, ర్యాంకుఁడులక్ష్మన్నయునునిజాశ్రితకువలై
ణాంకుఁడుసీతప్రభుఁడన, నంకితనామములవిజయమందిరిధరణిన్. 52

చ. సలలితభాగ్యచిహ్నముల సన్నుతికెక్కుడుచిన్నయాంబికా
జలరుహపాణితోడసుఖసంతతిఁ గాంచుమభూరివైభవం
బులఁ దనరారి నూతిజనముల్ జనముఖ్యుఁ డటంచు నెంచఁగా
విలసిలు రామభూవరునివెంకనృపాలుఁ డలోలశీలుఁడై. 53

మ. చియమామిళ్లకులాబ్ధిచంద్రుఁడు జయశ్రీసాంద్రుఁడచ్చన్నభూ
వరుఁడున్ వెల్లమనాఁదనప్పుతయణింబాణిగ్రహంబై శుభ
స్ఫురణన్ సంతతిఁ గాంచి విప్రతతికిన్ భూగోహిరణ్యాదిభా
స్వరదానంబులఁ దృప్తిచేసి తనరెన్ సభ్యుల్ ప్రశంసింపఁగన్.

శా. ఆరామప్రభుసీతభూతిలవిభుం డక్రాంతవిక్రాంత
స్థైర్యంబైనసురద్రుపంచకము గెల్వం బంచశాఖాహ్వయా
దారంబై నిజహస్తవారిరుహమిద్ధాత్రీసురశ్రేణికిన్
హేరాళంబుగఁ గోర్కు-లీవఁదనరున్ హేమాద్రితో మాద్రియై.

సీ. కులగోత్రముల కాదికొన్న చిన్నతనంబు, విపములో నుదయించు కసరుఁదనము
పుడమి నంతకనామమునఁ జేర్పువైశంబు, కేలు వెలారించు బేలతనము
కాఁపురం బప్పులగడపుకోఁచుఁదనంబు, నిలిచినచోట కాల్పులనిగొనము
మేనిమచ్చల నిచ్చలూనువిన్నఁదనంబు, గళమున గరమూను గడుసుఁదనము
తే. మానదిగ్రాజరాజవశ్యానుకూప, రూపగుణగణవిభ్రమారూఢగాఢ
వైభవస్ఫూర్తి మస్ఫూర్తి వసుధఁ బరఁగ, సరసుఁడైన సీతారామధరణివిభుఁడు. 56
క. శివిజ వెంకటలక్ష్మీ, దేవిమణివలన సంతతింగాంచుమవి
ద్యావైదుష్యంబునస, ద్భావంబున సీతనృపతి ప్రబలుఁడు ధరణిన్. 57
క. ఆరామప్రభుననుజుం, డైరాజిలులక్ష్మణేంద్రుయశమిల వెలసెన్
దారాచలతారాధిప, తారాచయతారహారతారాధంబై. 58
క. ఆలక్ష్మపతి నరపతి, వైలమ్మనజానకమ్మవలననిరుపురం
బాలురఁ గాంచెం బృథ్వీ, పాలురఁగా నాయఁడమ్మ పాపయ్యయునన్. 59
క. ఆనాయఁడమ్మ నిమ్మది, గానిలకొని పాపమాంబికాసహితుండై
నానావిధభోగమ్ముల, నానందమునొంది జగతి నభినుతిఁ గాంచెన్. 60
క. ఆనలువురు కూటస్థుల, లోనంగడగొట్టుసుజనలోలుఁడు వెంక
ట్నానాథుఁడు గోవిందాం, బానురతిం గాంచె సీతయాఖ్యం దనయున్. 61
క. ఆనలుగురుధీరులఁ దగు, నానలుగురు మీరువిభ్రమాతిశయమునన్
ధీనిరతిజయమునం జకు, రానమఁడైరామభూవరాగ్రణి ధరణిన్. 62
పంచచామరము. పన్నగారివాహుఁడూహ వన్నిచిన్నపాపఁడైఁ
యన్నగారివెంటనంట రాయి వరించు వైఖరిన్
బన్నగారివాహశాంకభాజిరామభూవిభుం
డన్నగారివెంటదంట రాయిచరించు వైఖరిన్. 63
మ. అనయంబు న్వినయంబు పండితుల కత్యానందముం గూర్పహే
మనగేంద్రప్రతిమానధైర్యుఁడగు రామక్షోణిపాలుండు తా
ఘనదానంబును క్షాత్రము న్గలసి యేకస్ఫూర్తి మూర్తిభవిం
చినచందంబునఁ దోఁచుఁ జూపఱకు నక్షీణప్రభావోన్నతిన్. 64
[illegible]. శీలగుణవృత్తముల ధాత్రిఁ జెలగువాని, రెడ్డిపెదపద్మనాభుపుత్రీలలామ
భాగ్యములదీవి రామభూపాలుదేవి, పడఁతులకు మేటిరమణమాంబావధూటి. 65
తే. రమణమాంబికవలన సారామవిభుఁడు, కనియె మువ్వురుతనయులగణితనయుల
ఘనునిఁ గోదండరామునిఁ గవిజనాను, నయులవేంకటరామన్ననాయఁడముల. 66
క. 67
ం డరామజపతి, వేదండకరప్రకాండవిలసన్నిజబా

కోదండమున వసుంధరఁ, బూదండరహి న్వహించె బుధులు నుతింపన్. 68

శా. మాన్యుండై తగువానిరెడ్డిపెదలక్ష్మక్షోణిభృన్మౌళిక
న్యారత్నము వాన్నమాంబతనకుం గాంతాలలామంబుగాఁ
గోవ్యోమత్సదృగిత్యుదారభుజుఁడై కోదండరామార్యమూ
ర్ధన్యుండాత్మభవుంజెలన్నయనునుద్యన్మూర్తిఁ గాంచెన్ రహిన్. 69

క. శ్రీపతిభాతిఁ జలన్నో, ర్వీపతియాలబోడపూడి వేంకటరామ
క్ష్మాపతిగాదిలిపట్టిక, రూపవతిఁ బకీరమన్నిరూఢి వహించెన్. 70

వ. అమ్మువ్వురిలోనం గోదండరామకృపాలునకుం గడగొట్టుతమ్ముండు. 71

ఉ. దండిగనాయఁడన్ బ్రభువతంసుఁడు భండనభూమి భూరిదో
ర్దండలమండలాగ్రమరిమండలిపై జళిపింపఁ గాంచియొం
డొండతిలోత్తమాప్రభృతియోషలు భూషణభూషితాంగులై
చండమరీచిమండలమె సారెకుఁ జూతురు కౌతుకంబునన్. 72

క. శ్రీవానిరెడ్డినాగ, క్ష్మావరునకుఁ బార్వతమ్మగారికిసుతయై
శ్రీవిన్ దగువెంకాంబను, శ్రీవిలసిలునాయఁడమ్మ చేకొనితనరెన్. 73

సీ. సత్యభాషల హరిశ్చంద్రుండు శ్రీరామ, చంద్రుఁ డీవనపాలచంద్రుఁ డొకటి
పవనవోన్నతి రతీనాథుండు నిషధభూ, నాథుఁ డీధారుణీనాథుఁ డొకఁటి
కాంతిస్వభావభూకాంతుండు పద్మినీ, కాంతుఁ డీమేదినీకాంతుఁ డొకటి
రణరంగమున బలరాముండు జమదగ్ని, రాముఁ డీసుగుణాభిరాముఁ డొకటి

తే. యీవిధనదుండుపనదుండునీతఁడొకటి, హేలనీకుండుమరుదీశుఁ డీతఁ డొకటి
ప్రబలుఁడనవిశ్రుతివహించె రామధరణి, పాలువేంకటరామభూపాలమౌళి. 74

సీ. తనరాకకెదురుచూచినచారికమ్ముల,దగఁ దీర్చునవపయోధరముమాడ్కిఁ
దనవాభ్యుదయంబుఁ దగఁ గోరుజక్కవ, కవలలాలించుభాస్కరునికరణిఁ
దనవాధిగమంబుతితివేమవిపినపం, క్తులఁ బ్రోదిగొనువసంతునివిధమునఁ
దనదుసాంగత్యమాత్మఁదలంచుకుముదిని, కామోదమొసఁగు నేణాంకుసరణి

తే. నభ్యుదయమందిసుజనులహవణిఁ బ్రోచె, రాజధరరాజశైలరాజభుజగ
రాజగోపాలకలశాబ్ధిరాజరాజ, రాజవతికీర్తివేంకటరామమూర్తి. 75

క. ఆవేంకటరామప్రభు, దేవి విరులతావి పిరులదీవి యమృతపుం
బావి నెఱతీవిఁ దనరున్, వేవిధములవెంగమాంబ విశ్రుతిమీఱన్. 76

ఉ. ప్రోదిగవానిరెడ్డికులమున్ గలిమిన్ వెలయించు సత్క్రియా
పాదినిపాపమాంబకును భవ్యయశుండగురాజమౌళికిన్
గాదిలిపట్టియై శుభవిలాసమువం దగువెంగమాంబకున్
మేదిని సాటివత్తురె ఘృణిన్ వాఁడన్ రమణీశిరోమణుల్. 77

సీ. పదినొళ్లఁభాషింపఁ బదురచ్చలను నెక్కి, పరమేష్ఠి నెలఁతయేభావ మెలఁత
నిలిచినచోటఁగా ల్నిలువకవర్తించు, శ్రీమహాదేవి యేసిరులదీవి
చండిరై తనప్రాణసఖునాటలాడించు, గౌరీషుమాటియేకళలక్షోటి
యడుగున లోకగుణం బనహెచ్చుతగ్గులై, నలినొప్పుపృథ్వియేనాఁటిసాధ్వి
తే. యనుచుననిచినకూరిమినణఁగి మణఁగి, కలిమిలేమిని భర్తతోఁగలసిమెలసి
హెచ్చుతగ్గుల నొకరీతి నెసక మెసఁగ, వెలసెవిలసితకీర్తుల వెంగమాంబ. 78
క. శ్రీవెంగమాంబికామణి, కీవేంకటరామనృపతి కిరువురుతనయుల్
శీవింగలిగిరిగుణగణ, భావితులై రామనృపతిపాపయ్యయనన్. 79
ఉ. మత్తగజంబులీలఁ జెలుమామిళవేంకటరామశౌరిపు
త్రోత్తముఁడైన రామవిభుఁ డోహరిసాహరిశత్రుకోటిపైఁ
గత్తిజళిపినదూసియొసకంబెసఁగన్ జళిపింపనింపుమై
గుత్తపుఁదాపితా అవికకుట్టుపటుక్కున విచ్చె రంభకున్. 80
చ. అహహపెరుంగురామమహిపార్థివదానపయఃప్రణాళులి
ట్లహరహమేటులై పరఁగి యాశలభూధరమానసామజ
ప్రహతకటీకటాహములఁ బర్వుచుఁ దన్నుతిప్రీలఁజేయుఁద
న్మహిమములెన్నమిన్న మహీమండలిఁ గుండలిరాజమాలికిన్. 81
క. శ్రీమీఱఁ దల్లిదండ్రులు, నామమిడిరి వేంకటాద్రినాయఁడనుచునా
రామక్షితిపతితమ్మునిఁ, బ్రేమంబాపయ్యయనుచుఁ బిలిచిరిపిదపన్. 82
సీ. ఒకవానరుఁడు నఖమ్మూనఁ బూనఁగలేక, మైనాకశైలంబు మగ్గ జలధి
నొకబ్రహ్మచారికోరికఁ దీర్పఁగాలేక, బలివిన్ననై రసాతలముఁజేరె
నొకనరుండెడదాఁక నోర్చుబీరములేక, గిరిజాధినాథుండు క్రిందుపడియె
నొకజోగిగొన్నగుక్కకు మించఁదడిలేక, కలశాబ్ధిరాజు భంగములఁబడియె
తే. నేటిధృతి యేటివితరణమేటిశౌర్య, మేటిగాంభీర్యమనినిరాఘాటధైర్య
దానశక్తిగభీరతానూనుఁ డగుచు, వరలువేంకటరాముపాపయ్యశౌరి. 83
క. శ్రీమచ్చిలుమామిళకుల, సోమునకున్ బాపయప్రచురనామునకున్
గామినియుభగామినిశుభ, గామినిమీనాంబతనరుఁ గలిమిన్ బలిమిన్. 84
సీ. ఆదిగర్భేశ్వరియనిబుధుల్ వినుతింపఁ, బుట్టుభోగములతోఁ బొలుపుమీఱి
యనుకూలదాంపత్యమనుచులోకులు మెచ్చఁ దనప్రాణనాథుచిత్తమున మెలఁగి
పరమపావనియంచు బంధువుల్ తోషింప, నిత్యవ్రతాచారనిరతిఁబూని
భాగ్యశాలినియంచు భామినుల్ గణుతింపఁ, గూఁతులఁగొడుకులఁ గూర్మిఁగాంచి
తే. శీవిఁదవరాశిఁ బద్మాక్షిదేవికధిక, వైభవమ్ముల భాసిల్లువానిరెడ్డి
రామలింగేంద్రునకును గారాబుపట్టి, మృదులగుణమణినికురుంబ మీనమాంబ. 85

సీ. విలసదద్దంకితిర్మలతిర్మలాచార్యు, నంఘ్రిపల్లవయుగం బాశ్రయించి
హరివాసరశ్రీసదాచారకలనంబు, నిత్యవ్రతంబుగా నిర్వహించి
సత్తటాకవనాదిసత్సంతానముల్, ప్రమథికోత్సాహుండై సంఘటించి
హితపురోహితసమాహితసమాహితముగాఁ, బురుషోహారియటంచు భూరిఁబంచి

తే. ధనకనకవస్తువాహనధాన్యపుత్త్ర, పౌత్త్రదీర్ఘాయురారోగ్య భాగ్యమహిమ
శీవిఁదనరారుమీనాక్షిదేవితోడ, మహితతేజుండు పాపయమాత్యవిభుండు. 86

వ. వెండియు హృద్యానవద్యపద్యసద్యోతకవిద్యాసముద్యమోద్యద్విద్వన్నికరసుకరాశీర్వ
చనరచనాప్రచీయమానసంపత్పరంపరాపూర్ణుండును, రణాగ్రవ్యగ్రనిజభుజాగ్రజా
గ్రన్మండలాగ్రప్రసారోత్సారితరిపుమండలహిండితచండమరీచిమండలుండును, నిరం
తరనిరంతరాయనిశ్శ్రేయసనిర్విశేషసమారబ్ధసత్త్రసంతానపరిపూరణస్ఫురణపరిణత సము
త్సాహదోహలుండును, శ్రీవెంగమాంబికాగర్భశుక్తిముక్తాఫలుండును, వైదికులగోత్ర
పవిత్రుండును, పావనచరిత్రుండును నగు శ్రీచిఱుమామిళ్ల పాపయ్యప్రభుం డొక్క
నాఁడు పుత్త్రమిత్త్రామాత్యబంధుసందోహ పరివృతుండై నిండోలగంబున సుఖాసీనుం
డై సరససల్లాపంబులం బ్రొద్దు గడపుచు. 87

ఉ. వసురామానుజపాదపద్మయుగళీనవ్యావ్యయధ్యానపా
వనహృద్భాగవతావతంసపదసేవాసక్తచిత్తుండమరు
త్తనయారాధనచారులబ్ధకవితాధారుండు సదారూఢభా
వసునాస్థానకవీంద్రుఁ జీర్తిఁ బిల్వంబంచి పల్కెన్ గృపన్. 88

క. పాత్త్రుఁడవై మైత్త్రేయస, గోత్త్రుఁడవై నారసింహగురువర్యునకున్
బుత్త్రుఁడవై వెలయుదువీ, ధాత్త్రిన్ మాపాలఁ బుట్టి యగు కృష్ణకవీ! 89

క. అవ్యయభవ్యావహమగు, కావ్యరచనమదియు మేలు గాదే బుధసం
భావ్యము విశ్వశ్రేయస, కావ్యంబనుమాత్ర మార్యఘటితం బగుటన్. 90

వ. అదియునుంగాక యొక్క విశేషం బాకర్ణింపవలయు నొక్కనాఁటి హరివాసరవ్రతో
పవాసంబున విశ్రాంతులై యున్నమజ్జనకచరణారవిందంబులకుం బ్రణమిల్లి కృతాం
జలిపుటుండనై యున్ననన్నుం జూచి వత్సా! సత్త్రసంతానంబులయందుఁ గృతిం బడ
యుట విశేషలాభంబనియు మహారాజన్యచరిత్రంబు కలిదోషనాశకంబనియు నాము
ష్మికఫలప్రదంబనియును బెద్దలు నిర్దేశింతు రట్లగుటం జేసి యొద్దియేనియు నొక్కరా
జన్యచరిత్రంబు కృతిముఖంబుగా రచియింపంజేసి వేంకటేశ్వరార్పణంబుగా నివేదిం
పుదగు నిదిమదీప్సితంబని యాదేశించుటయు నయ్యది నియ్యంబునకుం బ్రీతుండనై

జనవ్యాఖ్యానువర్తనంబు సలుపం బూనియున్నవాఁడు భవత్సన్నిధానంబునం దొర
కొనియెం గావున. 91

క. కృతికన్యాపతి వేంకట, పతియఁట కృతిభారకార్థపద్ధతియఁట్రయా
కృతిభవనిష్కృతియగునఁట, కృతివిగదానీవుజగతిఁ గృష్ణకవీంద్రా! 92

వ. అని యివ్విధంబునఁ బ్రశంసించి తాంబూలస్వర్ణాంబరాభరణంబులం బరిష్కృతుం
గావించిన నేనునుం బ్రహృష్టాంతఃకరణుండనై యక్కృతిపతి యగు శ్రీ వేంకటా
చలపతి నభివర్ణించెద. 93

సీ. ఏదేవదేవునిపాదరాజీవంబు, లోకంబులకు సౌఖ్యమాకలించు
నేపరాత్పరుదివ్యరూపానుభావంబు, భావంబులకు మేలు పాలుకొలుపు
నేజగజ్జనకునియిచ్ఛావిహారంబు, హారంబు ధారుణీచారుముఖికి
నేమహాబలశాలిహేలానతాగంబు, తాగంబువిష్టపత్రయమునకును
గీ. నేనుధీనిధికరి గాఁపురమై సుఖింతు, రంగబంగాళచోళకళింగవంగ
గౌళపాంచాలనేపాళమాళవాంధ్ర, శకయుగంధరముఖ్యదేశములనృపులు. 94

శా. ఆవిర్భాణపువేలుపుందొరప్రపన్నానీకముల్ గొల్వఁగా
శ్రీవైకుంఠపురంబువెల్వడి లసచ్ఛృంగారుఁడై యిందిరా
దేవిందోడ్కొనిస్వామిపుష్కరిణికాతీరప్రదేశంబునన్
భావింపందగుహేమసౌధమున శుంభల్లీలఁ గ్రీడించుమన్. 95

సీ. ఆమోదమునరమారామాలలామంబు, మెఱుఁగారునురముపై మెఱపులీన
నహితలోకైకదుస్సహసహస్రారంబు, లాలితంబగుచుఁ గెంగేలనమర
ఘనతరామలకనత్కనకోత్తరాసంగ, దీధితియొడలిపైఁ దేజరిల్ల
భూరిగైరికచారుహీరకోటీరంబు, కోమరారునుత్తమాంగమునఁ దనర
గీ. లలితధాతువిచిత్రశిలావిశేష, శేషగిరిశృంగశృంగారచితనిశాంత
బహుళమణిరాజరాజితభద్రపీఠి, సరసగతివేంకటాచలస్వామి వెలయు. 96

## షష్ఠ్యంతములు.

క. ఏవంగుణగణభృతికిన్, గేవలవిద్యాభిరతికిఁ గిల్బిషహృతికిన్
భావభవాకృతికిన్ విజ, యావహపరిణతికి వేంకటాచలపతికిన్. 97

క. శంకృతికిన్ చితదైత్యా, హంకృతికిన్ మణిగణోజ్జ్వలాభరణకృతా
లంకృతికిరణజయానక, ఝాంకృతికిన్ మదనసదృశభవ్యాకృతికిన్. 98

క. శరదరశరదంబుచనుర, తరువరనిర్ఝరసరిత్సుధాకరకరస
త్సురహరహరగిరిగిరిచర, చరదురుతరతరుణకీర్తికాతోదరికిన్. 99

క. శ్రీలలనకుఘనఘనాఘన, నీలునకవనీవనీవనీపకరక్షా
శీలునకు సద్ధికన్యా, ఖేలనలోలునకు శేషగిరిపాలునకున్. 100

క. ఖరకరకరగరవైశ్వా, నరనరహరిహారిమురారినవశౌర్యకలా
భరణునకున్ సకలకలా, భరణునకున్ శేషశైలవరవరణునకున్. 101

వ. అంకితంబుగా నాయొనర్పంబూనినశకుంతలాపరిణయం బనుమహాప్రబంధంబునకుఁ
గథాక్రమం బెట్టిదనిన. 102

---



# ప్రథమాశ్వాసము.

---

### కథాప్రారంభము.

తే. తాలహింతాలతూలరసాలసాల, మాలకతమాలకృతమాలమాలతీల
తాలతాళికళద్రజస్థగితగగన, రామణీయంబునైమిశారణ్యపదము. 1

క. ఆనైమిశవనభూమిని, శౌనకశాండిల్యముఖ్యసంయమివర్యుల్
పూనిమఖంబునసూతుని, మానితగుణజాతుఁజూచిమదిముదమొదవన్. 2

వ. భారతకథాసుధారసంబు వీనుల నించుచు మమ్ముఁ గృతార్థులం గావించితి వందు శకుంతలాదుష్యంతోపాఖ్యానంబు సవిస్తరంబుగా వినవలయుం జెప్పుమనిన సూతుండు పరమహర్షసమేతుండై శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 3

మ. కలదుర్విన్ బలగర్వితాహితకచగ్రాహగ్రహోద్యద్భుజా
ర్గళరాజద్ద్విజరాజగోత్రశిఖరద్రాజన్యసౌజన్యపు
ష్కలసద్వస్తుసమస్తహస్తినగరాఖ్యప్రఖ్యరాజన్వతీ
తిలకంబంగకళింగవంగముఖదిగ్దేశాధిపాశాస్యమై. 4

సీ. గురునైన భారతీపరునైననోడించు, విద్వత్ప్రవరులైనవిప్రవరులు
హరునైన దంభోళిధరునైనఁ దమకించు, రాజద్ద్యుమణులైనరాజమణులు
ఘనునైనమనుజవాహనునైనఁ దలఁకించు, నార్యాభిజనులైనయార్యజనులు
హరినైన గంగాలహరినైన విహసించు, బాహువిభవులైనపాదభవులు

గీ. వేదవిద్యాప్రభావభావితవితరణ, పరిణతయశఃప్రసారవిస్ఫారులగుచు
నలువుమీఱుదురగ్రవర్ణములధీరు, లాజవంజవధారులారాజధాని. 5

ఉ. నందితనూత్నరత్నవరణప్రతివాసరచంద్రచంద్రికా
కందళదిందుకాంతఫలకస్రుతపాండురవారిపూరముల్
చెందఁగనందమై పరిఖ చెన్నుసఁగున్ నిజవంశరాజసం
క్రందనులున్నతన్నగరిఁగాచుసుధాజలరాశికైవడిన్. 6

మ. స్ఫురదాకాశతరంగిణీమధురవాగపూరమ్ములం ద్రావఁగాఁ
గరము భ్రమ్మునకొత్తిహస్తిసమహాగంధేభరాజంబనన్

హరినీలద్యుతిదీప్రవప్రవలయంబై యున్నతద్వారగో
పురమైహస్తిపురంబు సేయనకుఁ బెంపుం గూర్చు నశ్రాంతమున్. 7

సీ. చూపట్టునొకవీథి సుకుమారతరపద, క్రమణమాతంగచంగములగములు
కనుపట్టునొకవీథి ఘణఘణక్వణరణ, ద్ఘంటికాతతతతాంగములగములు
సనిమీఱునొకవీథిఁ జక్రచంక్రమణాది, గమనదుర్గమతురంగములగములు
మొనమూపునొకవీథి ఘనభుజార్గళనిర, ర్గళవాహినీపురోగములగములు
గీ. తివురునొకవీథిబధిరితదిగిభరాజ,కర్ణకోటరపాటనక్రమసమగ్ర
పటహడిండిమభేరికాపణవమర్ద, ళప్రముఖహృద్యవాద్యకోలాహలములు. 8

సీ. ప్రసవాసవాసంగలసమానమదభృంగ, విసరైకశృంగారరసలవంగ
మనుభూతఫలసారఘనశుకవ్రజభార, వినమితఫలపూరవిటపివార
మతనుకేళివిలోలసుతనుపల్లవజాల, కృతనివాసతమాలతతవిశాల
మతులకోకిలపోతధుతపల్లవవ్రాత, నతలతాసంఘాతవితతచూత
గీ. మానమితచంమలసనకాలీనకలహ, కలితకలకలకలరవకులకులాయ
రంగదుత్తుంగతుంగనారంగరంగ, మలరునవ్వారపరిసరోద్యానవనము. 9

సీ. కులుకుగుబ్బెతగబ్బిగుబ్బపాలిండ్లపై, వలపులీనుజవాది మెలఁగిమెలఁగి
యలసౌధములవన్నెయలముద్దియలజాది, యలరుశయ్యలఁజేరి యులరియులరి
బెరసిపుప్పొడిగ్రమ్ముపెరటిలేమరువంపుఁ, దరులపందిరులపైఁ బొరలిపొరలి
మరుకేళివలయుఁకోమలికపోలములపైఁ, బుఱుఁగుఁజెమ్మటలతోఁ బొవలిపొదలి
గీ. సరసపరిసరకాసారసారసార, సవిసరసరణిపరితగ్రప్రసరణభరిత
పరిణతపరాగపరిమళపవనడింభ, మోజనలరించమించునారాజధాని. 10

ఉ. కుంతలకేరళద్రవిళకోసలసింహళగౌళమాళవా
శ్మంతకయూళఘూర్జరదశార్ణకళింగశకాదిమేదినీ
కాంతకిరీటరత్నఫలకప్రతిబింబితపాదుఁడైన దు
ష్యంతుఁడు తండ్రితాతలక్రియన్ ధృతిఁ బ్రోవ మేలు ధీరుఁడై. 11

సీ. ఏరాజుభేరికాభూరినిర్ఘోషంబు, ఘోషంబమరఁజేయుఁ గుటిలనృపుల
కేరమ్యగుణశాలిభూరిప్రతాపంబు, తాపంబుగూర్చు నధర్మరతుల
కేమేటినిజభుజాధృతచంద్రహాసంబు, హాసంబుగావించు నశనిధార
కేధన్యువితరణసాధుసంకల్పంబు, కల్పంబునకు వెలికాంతి నెఱపు
గీ. నతఁడు కేవలనృపుఁడె క్రూరాట్టహాస, చకితచకితాహితాహితస్వర్ణపూర్ణ
విశ్వవిశ్వంభరాధురావిధురతరభు, జాగ్రజాగ్రద్బలుండు దుష్యంతవిభుఁడు. 12

సీ. కొదదీఱవానలుఁగురియు పర్జన్యుండు, జగతిముక్కారుసస్యములు పండు
గ్రామముల్ ధనధాన్యకటకంబులై యుండు నతిమిధేనువులుచన్నవిసిండు

బ్రాహ్మణోత్తములకు బాధలు లేకుండు, నిత్యోత్సవంబులు సెగడుచుండు
సంధ్యలకాత్మజావాప్తిఁ గోర్కులునిండు, తరుల నిప్పుడు పండ్లు తనిగనుండు
తే. దరతమంబులఁ జామరదంపరనఁగఁ, బూలచేరత్నితటువలెభూత్రజలకు
నుత్తరోత్తరమభివృద్ధియౌలయుచుండు, నెలమిసద్ధాత్రి దుష్యంతుఁ డేలు నపుడు. 13
వ. వెండియు నమ్మహీమండలాఖండంబు రాజ్యంబు పాలించుచు గురుజనంబుల
యెడ వినయంబును సామంతులయెడ నెయ్యంబును మిత్రులయెడ మోదంబును
శత్రులయెడ భేదంబును పౌరులయెడ లాలనంబును బ్రజలయెడఁ బరిపాలనంబును
శిష్టులయెడ ననుగ్రహంబును దుష్టులయెడ నిగ్రహంబును జారులయెడ నక్షేపంబు
ను శూరులయెడ సంతోషంబును నీతిశాస్త్రంబులయెడ శ్రవణంబును సదాచారంబుల
యెడఁ బ్రచరణంబును ధర్మసూక్ష్మవిశేషంబులయెడ నాభిముఖ్యంబును ధర్మేతరంబుల
యెడ వైముఖ్యంబునుం గలిగి దిగ్విజయసమాసాదితోపచయరథకరితురగభటవిహార
సంకులంబు నక్కరినగరంబునం బిత్రుపైతామహం బగురాజ్యంబు పాలించుచు
నొక్కనాఁడు మహార్ణవమణిగణకిరణచ్ఛటాకంచుకితకాంచనసమంచితస్థూణాసుందరం
బగు నాస్థానమందిరంబునఁ బురోహితవిద్వత్సామంతమంత్రిప్రభృతు లిరుగెలంకులం
బలసి కొలువ సింహాసనాసీనుండై పేరోలగం బుండునవసరంబున. 14
సీ. నెఱసంజకెంజాయ నెరకు లెన్నడుపల్ల, జడలతో గరువంపునడలతోడఁ
దివుట తియ్యనితేనె దివురుప్రామినుకుల, పలుకుతో వజ్రంపుఁజఱుకుతోడఁ
బరమభాగవతసంపదమీఱునూర్ధ్వపుండ్రములతోఁ జక్రచిహ్నములతోడ
మందానిలాఘాతకందళన్మహతీస్వ, నములతో హరికీర్తనములతోడ
తే. జడమతులఁ దీర్చునుత్తమజ్ఞానఘనుఁడు, ధర్మసూక్ష్మార్థనిర్ణయతత్పరుండు
లోకసంచారి కాలత్రయీకథావి, శారదుఁడు వచ్చె నచటికి నారదుండు. 15
తే. దేవమునిరాక విని ధరిత్రీకళత్రుఁ, డెదురు చని భక్తిపదముల కెఱఁగి రత్న
చిత్రితవరాసనమున నాసీనుఁ జేసి, యర్ఘ్యపాద్యాదిసత్కార మాచరించి. 16
వ. కుశలప్రశ్నపూర్వకంబుగా బహువిధసంభావనావచనంబుల నమ్మహాత్మునిచిత్తం బా
రాధించి తదనుమతి నుచితపీఠంబునం గూర్చుండి కొండొకతడ వజ్జడదారిపలుకు
లకుఁ బ్రహృష్టాంతరంగుండై యమ్మునిపతి ముఖకమలంబునం జూడ్కి నిలిపి సవిన
యంబుగా నిట్లనియె. 17
ఆ. ఎచటనుండి మీర లిటకు విచ్చేసితి, రేమికతము చెప్పవే మహాత్మ!
మిమ్ముఁ జూడఁగంటి మీదయాదృష్టిచే, నభిమతార్థలాభ మందఁగంటి. 18
వ. అనిన దరహసితముఖుండై నారదుం డిట్లనియె. 19
మ. పురుహూతప్రముఖామరాధిపకళాపూర్ణప్రభాశాలియై
నరనాథుం డుదయించునట్టిఘను సన్మానంబునం జూచుటే

పరమార్థం బనిలోఁచున ట్లగుట భూపాలాగ్రణీ ! మాకు ని
వ్వరితో నేమగుధర్మవత్సలుల మైవర్తింతు మే మెల్లెడన్. 20

వ. అట్లుంగాక యింద్రాదిదిక్పాలకసందర్శనంబును గంగాదిపుణ్యతీర్థాచరణంబును గురుక్షేత్రాదిపుణ్యక్షేత్రావాసంబును గాంచ్యాదిదివ్యస్థలావలోకనంబును భవాదృశమహారాజ్యాధిగమనంబును మాకు నవశ్యకర్తవ్యంబు లైన నొకవిశేషంబు గలదాకర్ణింపుము.

సీ. శ్రీమహాదేవీలలామంబు పైదోడు, దేవెలుంగులవేఁడివెలుఁగుజోడు
యామినీకామినీకామునం దగువేల్పు, చిన్నారిపొన్నారిజింకదాల్పు
కటికిచీఁకటులనొక్కట మ్రింగుజగజెట్టి, కలశపాథోరాశిగన్నపట్టి
మేటిదేవతలకామెత లొసంగెడుప్రోడ, తొగనాలుగంటికిఁ దోడునీడ
తే. కడిఁది జడదారిసిగపూవు కళలప్రోవు, మెలపులకు నీమకాముని మేనమామ
కల్తివేల్పుమఱందిభోగములగొంది, రిక్కగమిమక్కువబోజుంగు రేవెలంగు. 22

క. కాంచెన్ మృగలాంఛనుఁ డొరు, నంచితనయుఁ దనయుబుధుఁ బదానతవిబుధున్
బ్రాంచితనుతిఁగనుసుతుఁగని, పెంచెఁబురూరవుబుధుండు భృతగౌరవుఁడై. 23

చ. ఒనరఁ బురూరవుండు దనయుం దనయున్నతిఁ గాంచె నాయువున్
ఘనుఁ డతఁ డాత్మజున్ బడసెఁ గంతు జయంతు జయింతు నన్మదిన్
గనదనురూపరూపయుతుఁ గానహుషున్నహుషుండు గాంచె నా
య్యాన భుజశౌర్యశీర్యదభియాతియయాతినయాతిలాలసున్. 24

వ. మఱియు నయ్యయాతికిఁ బూరుండును బూరునకు జనమేజయుండును జనమేజయునకుఁ బ్రాచీశుండును బ్రాచీశునకు సంయాతియు సంయాతికి హసంయాతియు హసంయాతికి సార్వభౌముండును సార్వభౌమునకు జయత్సేనుండును జయత్సేనునకు సురాచీనుండును సురాచీనునకు మహాభౌముండును మహాభౌమునకు నయుతానియుతుండును నయుతానియుతునకుఁ గ్రోధుండును గ్రోధునకు దేవాపియు దేవాపికి రుచికుండును రుచికునకు మతివరుండును మతివరునకుఁ ద్రసుండును ద్రసునకు నీలుండునుం గలిగిరి. యన్నీలునకు రథంతరాదేవివలన నుదయించి సోమాన్వయంబు కీర్తిపౌరుషంబుల కగ్రగణ్యంబుగా వెలయించు మహాభాగుండవ ట్లగుటంజేసి. 25

సీ. ఒకతాతకువలయాధికరంజనంబున, నఖిలలోకములరా జై తనర్చె
నొకతాతవిద్యాసముద్యమాపాదియై, యతిబోధమున బుధుం డనఁగ నెగడె
నొకతాతభూమిభృన్నికరశాసనమున, నధికుఁడై ప్రాచీనుఁ డనఁగఁ బరఁగె
నొకతాతదినదినప్రకటదానంబున, మనిసార్వభౌముఁడై మహిరహించె
తే. నొకఁ డొకనికన్న మిన్నయై యున్నతంపుఁ, దెంపుదరుకొత్తఁ బ్రజలను దేనిచి మనిచి
వనులమును లాచరించుదీవనలఁ దనరి, రదిగదా నీదుసంప్రదాయముకుమార !. 26

క. శైలంబున్ శైలంబిరు, గేలంగిలించిహాళిఁ గేళిగతులం
దాళగతింజఱచితివౌ, బాలుఁడవై యాడునాడుబలిమికలిమిచేన్. 27

తే. వనులఁ గ్రీడించుదుష్టసత్త్వములవలన, నాశ్రమమ్ములనొదవెమహాశ్రమమ్ము
వెడలుమడవికినిపుడ కావింపుమింపు, తాపసహితాప్తిమాకుఁ బ్రతాపసహిత! 28

వ. వినుము ధరణీవలయపరిపాలననిష్ఠాగరిష్ఠు లగునృపశ్రేష్ఠులకు శాస్త్రిసమ్మతం బగుట మృగవ్యం బవశ్యకర్తవ్యంబు గావున నారణ్యకభటపరివృతుండవై గిరితరుకంటకశిలాదుర్గంబు లగుమార్గంబులు నిరోధించి శరభశార్దూలాదిదుష్టసత్త్వంబుల సంహరించి యాశ్రమంబులకు సౌఖ్యం బాపాదింపు మమ్మహామునులయనుగ్రహంబునం జక్రవర్తిలక్షణలక్షితుం డగుకుమారుం డుదయించి వంశకరుం డగునని యాదేశించినం బ్రమోదపులకితస్వాంతుండై దుష్యంతుం డట్లకాకయని యంగీకారపూర్వకంబుగాఁ బ్రణమిల్లి వీడుకొల్ప నాశీర్వచనముఖరముఖుండై యామంత్రణం బాచరించి యంతర్ధానంబుచేసినం బదంపడి యప్పుడమిఱేఁడు మృగయావినోదకౌతుకాయత్తచిత్తుండై యుండునవసరంబున నిదాఘంబు వర్ధిల్లుటయును. 29

సీ. భానుఁడన్ పూర్వాబ్ధిబడబాగ్ని కెదురుకో, ల్వచరించు నపరాబ్ధిబాడపంబొ
పొడిచినారవిఁ జీవపూర్వేద్యురవసాన, చరమాద్రిదవనివిష్టజ్వాలనమొ
ప్రతిమాధవోత్థమై ప్రబలిజిక్కుల నేర్చు, నాభీలవృహరికోపానలంబొ
ప్రాక్సపత్నిఁ గరంచుభర్తఁ జూచి ప్రతీచి, యొలయించు వేఁడినిట్టూర్పుగమియొ
తే. తరతమంబులఁ దఱుఁగనిత్రంపిగాఁగఁ, దపనతపనీయమాతపతాపవహ్నిఁ
గ్రాఁచుకాలకళాదుఃప్రాతౌక్కరచయమొ, నాఁగఁ దగెఁ బశ్చిమానిలోగ్రాగమంబు. 30

మ. లలినుర్వీతలముంబగిల్చి నభమెల్లం దానయైయిమ్ములం
గలకీలాలపుజాలు మేఁబడిపి తన్గ్రాఁచన్ దలంపన్ మహా
బలునవ్వేసవివహ్నిదాశరణమున్ బ్రార్థించితన్మైత్రిను
జ్జ్వలుఁడై నాఁటనుగోలెవాయుసఖుఁ డన్ ప్రఖ్యాతిఁ గాంచెన్ ధరన్. 31

మ. అహహాలోకములేకొలందిమనుఁ గీలాభీలవాతూలదు
స్సహమైతీండ్రలమందువేసవికి నీశశ్రీశవాగీశుల
న్వహమున్ మూర్ధమునందుశయ్యానిగమవ్యాపారపాత్రంబునన్
బహుమానింతురువారిఁ దత్సమయతాపక్రాంతిశాంత్యర్థమై. 32

ఆ. పగలువిస్తరించిమిగులవేఁడిమినూపు, తపనుఁజోరకచాయతవులనీఁగెఁ
బరమసాధ్వియయ్యుభర్తవెన్నాడెనే, తగనిశిక్షసేయఁదగదు పతికి. 33

తే. సూర్యుఁడునిజప్రతాపంబునూపసూర్య, కాంతములురేఁగినిప్పులుగ్రక్కఁదొడఁగ
నినుఁడుకోపింపఁ బరివారమినుమడించి, కడిమినూపుటధరణినిక్కంబకాద. 34

సీ. యంత్రధారాగృహాభ్యంతరాళములందు, పరవర్ణినీపయోధరములందుఁ
గమనీయగోస్తనీకాయమానములందు, ఘనసారకదళికావనములందు
బహుపాదపాదపప్రబలవాటికలందుఁ, గాసారతీరసైకతములందు
మల్లీమతల్లికావల్లీగృహములందు, నికటపానీయశాలికలయందుఁ
ఆ. బరువమగుపండువెన్నెలబయళులందుఁ, దరళితమృణాళతాలవృంతములయందుఁ
గేళిలాసక్తులగుచుభోగింపనరిగి, పాయరామండువేసవిఁబతులుసతులు. 35
తే. అటనభంబునడంబరయ్యెనంబుదంబు, పశ్చిమంబుననింద్రచాపంబుదోఁచె
నొలసితూరుపుగాడుపులుత్తరమున, నవనవతటిల్లతావితానంబుబెరసె. 36
సీ. తపముపెంపునఘోరతమమైదిశలఁబ్రాఁకె, జలజబాంధవుఁగప్పుకార్వరంబొ
కేకినీనృత్తభంగికిఁగూర్చుమెఱుపులఁ, గరదీపికలఁజేయుకజ్జలంబొ
పర్జన్యశరణంబుప్రాపించిగఱులతోఁ, జనలఁగ్రుమ్మరుశిలోచ్చయచయంబొ
ధరణీధరములేర్పడవహావ్యవహమున, వెడలుధూమస్తోమవిస్తరంబొ
గీ. యోగశయ్యాభిముఖముగానొలయఁజూచి, శ్రీమహావిష్ణుపదముఁగైసేయుటకును
వెడలునింద్రావధూటిమైవిలసనంబొ, నాఁగనభముననవఘనాఘనంబు. 37
క. తళతళమెఱసెన్మేఘము, పెళపెళనుఱిమెన్నభంబుఁబిటలువాఱం
బలపలగురిసెన్వర్షము, జలజలనిలనింద్రగోపజాలమురాలెన్. 38
తే. తపమునకువిఘ్నకరియంచుఁదలపఁడర్కుఁ, డొలయువర్షావధూటిపయోధరముల
వేయికరములనింపెనవ్వేడబమున, నపుడ శాంతించెనతనిమహాతపంబు. 39
ఉ. మించెఁదళత్తటిద్రుచులుమీఱెమెఱుంగులమొత్తముల్ విడం
బించెదిగంతరాళములభీతికృదూర్జితగర్జితధ్వనుల్
నించెఘనాఘనంబు ధరణీవరణంబునభూరివారిన
ర్తించె మయూరవారము పరిస్ఫుటబర్హసమర్హణార్హమై. 40
శా. అవ్యాయంబున హెచ్చి గ్రీష్మఋతురాజక్రాంతమున్ భోజనో
దవ్యాశాపము వేర్పరింపఁగనిక్రోధస్ఫూర్తిగర్జిల్లిప
ర్జన్యుం డభ్రరథస్థితిన్ మణిగణచ్ఛాయల్ దలిర్పన్ మహా
జన్యస్థేమమునూనెనో యన శరాసారంబు పర్వెన్ వడిన్. 41
వ. వెండియుం బుటపాకభాస్వరకార్తస్వరలతావితానంబులతెఱంగునం దుఱంగలించు మెఱుంగులమొత్తంబులును, మెఱుంగులమొత్తములతోడ సమాత్తమ్ములై మందరమంథానమథనపరిక్షుబ్ధదుగ్ధజలనిధినిర్ఘోషంబులవిధంబున నూర్జితంబు లగుగర్జితంబులును, గర్జితంబులతోడం బరిస్ఫూర్జితంబులై దశముఖసంగ్రామసమయసన్నాహసముద్దామరామకరలాఘవవినిర్గతశరాసారంబులకరణి ఘోరంబు లగుధారాళధారాధరధారాసారంబులును, ధారాసారంబుల ధరాపరాగంబులు దుర్దమంబు లగుకర్దమం

బులై నతోలంచి నిలువక జాలువాఱి కాలువలై నిలుక లేక తెప్పదెరలం బొరలుజలప్రవాహంబులును, జలప్రవాహంబులతరణంబులకుఁ గరణంబులులేక యిరుగడలం బడలుపడి పడిగాఁపులై యున్నయధ్వన్యులును, నధ్వన్యు లగుపథికులయోగక్షేమసమన్వేషణంబు లగుభాషణంబుల ముఖరంబు లగుముఖంబుల విన్నఁదనం బొలయ నిట్టూర్పు నిగుడ్చుచుఁ దదాగమనంబున కెదురుసూచుకుటుంబినులును, గుటుంబినులధారణంబు లకుం గారణంబు లయినకృషివ్యాపారంబుల నపారంబులగు హాళహాళికలం జెలంగు ప్రబలహాలికులును, హాలికులపరిశ్రమంబులం బ్రశస్యంబు లగుసస్యంబుల నుదారంబు లగుకేదారంబులును, గేదారంబులసమృద్ధి నభివృద్ధిం గాంచువరగ్రామంబుల శుభసన్నివేశంబు లగుదేశంబులుం గలిగి వర్షాగమంబు సుగమంబై ప్రవర్తిల్లువవసరంబున. 42

క. వచ్చెన్ శరదాగమ మొగి, విచ్చెన్నేత్రాంబుజములు విష్ణుఁడు ధరపై
హెచ్చెన్ గాన వనంబులు, మెచ్చెన్ పశువిసర మెసఁగి మెసవుకసవులన్. 43

చ. తొలఁకులుదేఱెఁ బద్మినులకుం గనువేఁదుఱుదీఱె మేఘముల్
వలఁకులఁ జేఱెఁ డొంకలను వంకలఁ బంకము లాఱె ఢేకికా
హాళహాళికంబు లూరెఁ గలహంసరుతమ్ములుమీఱెఁ గేకినుల్
వెలవెలఁబాఱె సస్యము నవీనరుచిం దనరారె నత్తఱిన్. 44

చ. అరయవితీర్ణిచే ఘనత నంది పయోదము భూరిఘోషవి
స్ఫురత సపంకజీవన మొసంగె జనంబులకేటిధర్మము
ర్వ్యరనిఁకవారికల్మషము వాఁపెదనంచు రహించెనోయనన్
శరదృతువొప్పెనా హృదయసమ్మద నిర్మలవారిపూరమై. 45

వ. ఇత్తెఱంగునం దుఱంగలించి శరద్వాసరంబు భాసురం బగుటయు నారదమహాముని వాక్యంబులం బుట్టినయాగ్రహావేశంబున దేశంబులయోగక్షేమంబులఁ దేరంబనిచిన చారు లాదుష్యంతునకుం బొడసూపి జయజయశబ్దపూర్వకంబుగా మ్రొక్కి మహారాజ శిఖామణీ! దేవరయానతి నలుదెసల యోగక్షేమంబు లరసివచ్చితి మ్మహామునివాక్యంబుల వృతంబగునే కరి కిరి తరక్షుహర్యక్షప్రముఖంబు లగుసత్త్వంబుల గిరితరంగిణీతటోద్దేశంబులు దుష్ప్రవేశంబు లై యున్నయవి నయాచరణపరిణతసత్త్వవితరణంబున నార్తులకు శరణంబ వగుము. 46

చ. లలదురుకాశచామరవిలాసముపాండురపంకజాతప
త్రిలసనముంబొనర్చుచు శరద్రమణీమణితోడుసీడగా
గెలువడివెంటనంటి యటవీతటవీథుల సత్త్వకోటులన్
నెలకొననీక త్రుంపఁ దగునీలకుమార కుమారవిక్రమా. 47

క. అనిచారులువినిపించిన, వినివారలఁగనిహసించి విభుఁ డిట్లనియెన్
ఘనధాటిన్ వనవాటిన్, గొనగోటన్ సత్త్వకోటిఁ గ్రుమ్మెద నిమ్మన్. 48

క. రాఁబనుపుఁడు పార్వతికులఁ, దేఁబనుపుఁడు తెఱఁగుపఱిచి తేరిటుసఱువం
గాఁబనుపుడుజయభేరిన్, వేఁబనుపుఁడు కర్మకరుల వేగిరపఱుపన్. 49

వ. అని యివ్విధంబున. 50

క. ఆఖేటమునకుధాత్రీ, శేఖర్షభుఁడనుమతింప శేలెండనుచున్
శ్లాఘించుచుఁబడవాళుల, లాఘవమునఁబనిచిరగ్గలంబుగఁ జారుల్. 51

వ. తదవసరంబున. 52

మహాస్రగ్ధర. మృగయాప్రస్థానభేరిన్ మిగులఁజఱచినన్ మీరుఘోషంబుపేర్మిన్
గగనంబున్ భూతలంబున్ గడగడపడఁకెన్ గంధులింకెన్‌దలంకెన్
దిగిభశ్రేష్ఠంబు లెల్లం దిరదిరదిరిగెన్ దేవయానోత్తమంబుల్
నగముల్ ఘూర్ణిల్లె నానానగచరవరముల్ నద్దెసల్ప్రాఁకె భీతిన్. 53

వ. మఱియు నజ్జనపతి మజ్జనంబాచరించి చీనాంబరాభరణమాల్యాంగరాగంబుల నలంకృతుండై కాల్యకరణీయంబులు దీర్చి యగ్నిసమారాధనంబు నడపి గోభూహిరణ్యాది దానంబుల బ్రాహ్మణులం దనిపి భక్ష్యభోజ్యంబులం దృప్తుండై తనుత్రాణశిరస్త్రాణంబులు దాల్చి సన్నద్ధుండై భూసురాశీర్వచనపూర్వకంబుగా శుద్ధాంతంబు వెలువడి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగుమొగసాలకుఁ జేరంజనునవసరంబున. 54

సీ. మెఱుఁగువజ్రములఁ బన్నినకమ్ములనుసుగాఁ, గలకలధౌతచక్రములతోడఁ
బచ్చరామొసలివాపవడంపునొగలపై, నొఱపైనజలపోతయుగముతోడఁ
బసిఁడిచట్టపులోవ పద్మరాగముల చప్పరము చెక్కడపుఁగంబములతోడఁ
నీలంపుటిరుసు టందికనమర్పఁ దలిర్చు, కెంపురామలుపుఁ డెక్కెంబుతోడఁ
తే. గొసలజగజంపుముత్యాలగొడుగుతోడ, నిగనిగత్పుష్యరాగఘంటికలతోడఁ
జతురవల్గనవల్గవశ్వములతోడ, సారమగు తేరుసారథి చేరఁదెచ్చె. 55

వ. ఇవ్విధంబున సారథి తేరాయితంబు సేసి తెచ్చిన. 56

చ. వలగొని మ్రొక్కుచుం జతురవైఖరి నారథతల్లజంబుపై
నెలకొని రా ధరాపతికి నెయ్యమెలర్పనివాళులిచ్చుచున్
జెలువము మీఱఁగ్రొవ్విరుల సేసలుచల్లిరి భామినుల్ నిర
ర్గళజయభేరికాపటహకాహళముల్ మొరయం బొరింబొరిన్. 57

వ. ఇట్లు మదద్విరదరథతురగసైనికనికరదుర్గం బగురాజమార్గంబున మందగమనంబునం బురందరవిభవంబునం జనిచని పురంబు నిర్గమించి. 58

చ. పరిఘభుసుండికాముసలపట్టిసకుంతకుఠారశూలము
ద్గరకరవాలతోమరగదాశరచాపకరాగధారులై
పరిగొని యగ్రభాగమునఁ బార్వతికుల్ నడనన్ మహీతలే
శ్వరుఁడు రథస్థుఁడై కుసుమశాలివనాలి వయాళి వెల్వడెన్. 59

వ. ఇట్లుఘోరంబులగు కాంతారంబుల ప్రవేశించి యప్పుడమిఱేఁడు వీరభటులం బురికొల్పిన. 60

సీ. ఘుర్ఘురధ్వనులఁ దార్కొనువరాహంబులఁ, గడిఁదిబల్లెములతోఁ బొడిచిపొడిచి
కినిసి గోండ్రిలుచుఁ బైకొనుపంచనఖములఁ, బారుటేఁటుల డిందుపఱచిపఱచి
కనికాండ్రుపొడిచి మార్కొనుసైరిభంబుల, ముసలముద్గరముల మోఁదిమోఁది
ఘుల్లురంచు నెదుర్చుకంఠీరవంబులఁ, జంద్రహాసంబులఁ జదిపి చదిపి
తే. గిరులచరులను దరులను దరులఝురుల, దొరలఁబొరలుచుఁ జెరలాడుకరులరురులఁ
గెరలిమరలినఁ దెరలినఁ దరలనీక, వెఱపుమఱి వేది పొడిచిరి వీరభటులు. 61

శా. ఆరాజన్యుఁ డుదగ్రుఁడై పొదివి సింహవ్యాఘ్రభల్లూకభూ
దారర్క్షాదికదుష్టసత్త్వసతతోత్థానంబు చాపస్ఫుర
న్నారాచప్రముఖాంబకంబులజడిన్ మాయించుచున్ గ్రక్కునన్
ఘోరారణ్యపదాశ్రమంబులఁ బరిశోధంబు మాన్పెన్ గృపన్. 62

వ. ఇవ్విధంబునం బుణ్యనదీకూలంబులను గులకుధరపరిసరంబులను బావనాశ్రమనికటంబులను బరిభ్రమించుక్రూరసత్త్వంబుల ననర్గళప్రకారపరిణత శరాసారంబులఁ బడలుపడం జేయుచు. 63

క. ఘనసదములవనపదములఁ, జనిముదములకారదుష్టసత్త్వప్రతతిన్
మునిపదముల జనపదముల, ననుపదమును గెడల నృపతి యడిముడి నఱికెన్. 64

ఉ. ఈరముచెంత మేయుచొకయేణము నేసినఁజూచి తత్ప్రియ
స్త్రీరహిఁ బాసి వల్లభునిసేమముఁ గోరుచునడ్డమయ్యెఁ ద
ద్దారుణహృద్వ్యధం దెలిసితానదరించుశరంబు క్రమ్మఱన్
మారటతూపునన్ దునిమె మానవభర్త దయాసమగ్రుఁడై. 65

క. గవయింగవయూథైతమిఁ, గవయుంగవయుంబుమీఁద గవగవగవియం
గవియించిన జాగిలములఁ, గవియంగానీఁడు భర్త కరుణాన్వితుఁడై. 66

క. కదళీదళములనీడం, గదళియుఁ గదళంబు నిదురఁగైకొనఁ బొదువం
గదలెడుజాలములంగని, కదలంగానీఁడుభర్త కనికరమొలయన్. 67

క. పున్నాగంబుల వలగొని, పున్నాగము విఱువఫణులు బుసబుసలాడన్
బున్నాగమఱుకవానృప, పున్నాగముచూచిచూచి పోరిఁబోరి నవ్వెన్. 68

వ. ఇవ్విధంబున నమ్మహీకాంతుండు హేమంతశిశిరవాసరంబుల మృగయావినోదంబులం దవిలి వర్తిల్లునవసరంబున. 69

ఉ. మావుల నేలుమన్నదొర మందసమీరునిసంగడంబు నె
త్తావులతావు తామరలతంపరజాజి తొలంగుఁబావలేఁ

దీపమిటారిజవ్వనపుదీమవికాళుల మిట్టపంటఁ గ్రొం
బూవిలుకానిసాహిణపుఁబ్రోవరి యామని వచ్చెనత్తఱిన్. 70

సీ. తోలుదోల్తఁ బండుటాకులు రాలవనెత్తి, యొండుకెండిరువుల నొటిపుమీఱఁ
బదపడితలిరుజొంపములఁ దుంపెసలాడి, పసరుమొగ్గలఠీవి నెసకమెసఁగ
వెనువెంటముకుళముల్ విప్పవాఱఁ దనర్చి, విరులకొండములతో విఱ్ఱవీఁగఁ
దోడ్తోడ నిత్తావిదొరయుపుప్పొడిరేఁచి, కమ్మఁ దేనియసోనఁ గడలుకొలిపెఁ
తే. బ్రకటశుకపికశారీమధుకరనికర, సుకరకురవకమరువకాశోకకులక
తిలకసహకారముఖధరిత్రీరుహాళి, హాళిఁ బాలించునవవసంతాగమమున. 71

లయగ్రాహి.—
అందములఁ జిందుకురువిందములచందమునఁ గెందళుకులందివిరికందొవలవిందై
సందుగలయందొడువుక్రొందలిరులందనరుపెందరులఁ జెందిచెలువొందువిరులందున్
గందళదమందమకరందరసమందిరొనిముందుతమసుందరులకుందవుపు మందా
రుందనిసిడెందమలరందివమునందిమొరయందగుమిళిందములబృందములక్రందుల్. 72

ఉ. గుమ్మనుకమ్మతెమ్మెరలకుందులకించి వసంతవేళలన్
గొమ్మలుకాననాంతరనికుంజములన్ జెలువారనొంటిమైఁ
బమ్మినరక్తిచే నినయుపల్లవకోటులదూర నేలకో
కొమ్మనికూడి క్రొవ్వలపుఁ గూర్చెబళీ సుమవస్సమూహముల్. 73

ఉ. ప్రీతిఁదలిర్చె మాధవుఁడు పెంపెసలారెడువేళ భూమిరు
ట్జాతులకెల్ల నందు శోకజాతిరహింపక యున్కిఁ జూచి త
జ్జాతిరహింపనిద్దురమిషంబునఁ గన్గొనఁజయ్యెమాధవుం
డాతెఱఁగట్లగున్ భువివనాశ్రితులం గణుతింతురెవ్వరున్. 74

వ. ఆసమయంబున. 75

ఉ. మోదమొనర్చెఁ బుష్పదులమ్రుగ్గులపై నొఱపైనపొంగలన్
గేదఁగిపూలటెక్కెములఁ గెందలిరాకులతోరణంబులన్
బ్రోదివహించుపక్వఫలపుంజములన్ శుకకోకిలాలిస
వ్వాదములన్నికుంజభవనంబులనీలన్నపాలనూతికిన్. 76

వ. ఇట్లు వసంతసమయసముచితకిసలయకుసుమవిసరసరసపాలప్రముఖపాలరుచిరంబులగు నుద్యానంబులం జూచుచుం జనునమ్మహారఘునిరథవేగంబునకుఁ గాక నీరువట్టువం బీఱుపోయి పైనికులంతనంత నిలిచినం జనిచని. 77

మ. అటఁ గాంచెన్ నరలోకవర్యుఁడు సమగ్రాశ్చర్యుఁడై మాలినీ
తటభూమింబనసానసామ్రసరళద్రాక్షామ్లికాశాల్మలీ

పటుశారంగలవంగలుంగలవలీవాశాదిశాఖిచ్ఛటా
రటదున్మత్తవిహంగచంగయుగళభ్రాజన్మహోద్యానమున్. 78

వ. ఇట్లనతిదూరవర్తి యగున య్యుద్యానంబుఁ గన్గొని హృదయానందపోషంబు లగు
నందలివిశేషంబులకు నాశ్చర్యంబు నొందుచు మాతునితో ని ట్లనియె. 79

క. ఆనందనవనముం బలె, హానందనమాచరించు నశ్రాంతంబున్
దైనందినఫలకుసుమ, శ్రీ నొందిన యివ్వనంబు చిత్తంబునకున్. 80

సీ. ఘనసారఘనసారకదళికామోదంబు, నాసాపుటప్రీణనంబొనర్చు
ఫలపూరఫలపూరమిళదామ్రజకలంబు, రూఢిమైరసనకు రుచులు గొలుపుఁ
గలకంఠకలకంఠకాకలీకలనంబు, శ్రవణేంద్రములరంజన మొనర్చు
వనజాతవనజాతఘనచాకచక్యంబు, నయనాబ్జములకు నానంద మొసఁగు

తే. సవిధవివిధాగమక్రమప్రంసదంస, లసుమరసమగ్నమాలినీలలదభంగ
భంగశీకరనికరార్ద్రిపవనడింభ, మనయవములకు నుల్లాసమావహించు. 81

క. జ్ఞానేంద్రియపంచకమున, కానంద మొనర్చుచున్న యదియట్లగుటన్
మానీశ్వరుఁడొక్కరుఁడే, కానవనాశ్రమముగాఁగ గైకొనఁబోలున్ 82

సీ. తాపసార్భకకరప్రాపితాహారంబు, రుచిచూచుగండభేరుండచయము
గండభేరుండముల్ కండూయనముచేయ, జతగూడి క్రీడించుశరభవితతి
శరభచంగముల విస్ఫురదూరువులమేలు, లూని నిద్రించుపంచాననములు
పంచాననములతోఁ బరిచయంబులుచేసి, భయమేదివిహరించుభద్రకరులు

తే. భద్రకరికరశీకరప్రబలసేక, సరళకర్పూరకవళికాతరులనీడఁ
బొరలుకూర్జాలములమీఁద నొరయు నెలుక, లద్భుతక్రమమైన యీయాశ్రమమున.

సీ. వేదాంతవాగర్థవివరణం బొకచోట, నొకచోటనృత్యన్మయూరనివహ
మధ్వరక్రమసముద్యమఘోష మొకయోర, నొకయోర మత్తాళినికరగీత
మభ్యాగతబ్రాహ్మణార్చనం బొకక్రేవ,నొకక్రేవఁ బారావతకలరావ
మతిఘోరనియమసంయమియూథ మొకపజ్జ,నొకపజ్జ శారికాధికవిలాస

తే. మఖిలతంత్రస్వతంత్ర సంఖ్యావదగ్ర్య, గణ్యపుణ్యకథాసుధాకలన మొకట
నొకటనవకుంజపంజరశుకమ్మువార్త, శాంతశృంగారముల వేడ్కసలుపునిందు. 84

క. ఈయాశ్రమతిలకమునకు, వేయాశ్రమ మైన ధరణినీడనఁదగునే
పాయకతపమీరొడనస, హాయుండై సేయుచున్న యతఁ డెవ్వరొకో. 85

క. ఆమునిసుత్రామునినభి, రాముని సేవింపవలయు రాజల్లతికా
ధామమ్మునఁ బ్రేమమ్మున, సేమమ్మున నిలుము వారలు సేదలుదేరన్. 86

క. అనుచుం జనుచుం జనుచున్, మునిచంద్రునిఁ జూడఁ గోరి ముద మెసనొదవన్
దిననాథతేజుఁడగున, జ్జనవాథుఁడు తేరుడిగ్గిసత్వరుఁడగుచున్. 87

వ. ఇవ్విధంబున నన్నరపతి రథావతరణంబు చేసి విశాలరమణీయం బగులతామండపంబున రథంబు నిలుపునట్లుగా సారథిం బనిచి సవినయంబుగా నాశ్రమాభిముఖుండై నడచె ననవిని కుతూహలాయత్తచిత్తుండై జనమేజయుండు తరువాతిచరితం బడుగుటయును. 88

చ. సనకసనందనాదిమునిసన్నుతపావన! రమావినోద! కాం
చనమయవాస! శత్రుజననాశన! దాసనమస్క్రియాప్రియా!
వనరుహనేత్ర! పత్రరథపత్ర! పవిత్రచరిత్ర! సామగా
యనఘనశేషశైలనిలయా! వలయాదివిశేషభూషణా. 89

పంచచామరము. పురాణభోగిభోగభాగ! పుణ్యగణ్యనర్తనా!
విరించిసంచితప్రపంచవిశ్రుతాత్మకీర్తనా!
స్మరాతిసుందరాంగ! సత్తమస్తమోవికర్తనా!
చిరస్ఫురద్విశేషవేష! శేషశైలవర్తనా. 90

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందన ప్రసాదసమాసాదితకవితావిచిత్ర మైత్రేయసగోత్ర నృసింహగురుపుత్ర కృష్ణకవిప్రణీతం బైన శకుంతలాపరిణయం బను మహాప్రబంధమ్మునం దిష్టదేవతాప్రార్థనంబును, కృతిపతిగుణకథనంబును, గ్రంథావతరణంబును, దుష్యంతనారదసంవాదంబును, ఋతువర్ణనంబును, దుష్యంతమృగయావినోదనంబును మొదలగు విశేషంబులం గలిగిన ప్రథమాశ్వాసము.

---



# ద్వితీయాశ్వాసము.



కర! పరభీకర! ర
త్నాకరగంభీర! పండితవశీకర! ద
ర్వీకరవరపర్యంక! గు
ణాకరమణివలయ! వేంకటాచలనిలయా. 1

వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దుష్యంతుం డయ్యాశ్రమంబుఁ బ్రవేశించి యందలిమునికుమారులవలన నది కణ్వాశ్రమంబని యును నమ్మహాత్ముండు తీర్థయాత్రాచరణంబునకు వెడలె ననియును విని విఫలమనోరథుం డయ్యును నాంగికంబు లగుశుభసూచకంబుల నిరూపించుచు వధూజనసల్లాపంబు లాలించి యవ్విశేషం బన్వేషింపం దలంచి. 2

శా. ప్రాంచజ్జ్వాలరసాలమూలమునఁ బుంభల్లీలనాసీనుఁడై
కాంచెన్ బార్థివమాళి పూఁబొదలయిక్కం బక్వబింబాధరం
గించిత్కుంచితకుంతలన్ మణినిభాంగిన్ జక్రవాకస్తనిన్
జంచద్భ్రూయుగమధ్యవక్త్రునిశాచంద్రాలికన్ బాలికన్. 3

తే. కాంచిమదనవికాసంబు గౌరనంబు, సాదరాలోకనము సంశయంబుమరులు
విస్మయంబును రాగంబు వెలుఁగుదోఁప, భావశబలాంతరంగుడై పార్థివుండు. 4

వ. ఇట్లు కనత్కనకరంభాసుభగంభావుకకదంబకదంబకమధ్యంబున ద్రాక్షాగుళుచ్ఛరింఛోళికామధురమధురసామోదమేదురమధుకరనికరఝంకారసంకులం బగులవలీకాయమానంబు చేరువం గుసుమితలతావలంబనంబునం బెనరునవ్వనరుహముఖిం గాంచి యనన్యకన్యాసామాన్యం బగునక్కన్యకామణిలావణ్యంబునకు నాశ్చర్యంబు నొందుచు. 5

క. శరణాగతభరణాతత, కరుణావరుణాలయుండు కమనీయసుధా
కిరణాన్వవాయమణియ, య్యరుణాధరఁ జూచి సందిహానుండగుచున్. 6

క. సురకన్యకయో విద్యా, ధరకన్యకయో నిజంబు దర్కింపఁగఁ గి
న్నరకన్యకయో కాక, న్నరకన్యకలందు నిట్టినలువుం గలదే. 7

పంచచామరము. జగానిగారవుర్ మెఱుంగుచాయలీను మేనిడాల్
మిగుల్ మొగుల్ మఱుంగుఁ బాపి మించుమించులన్ జిగిన్
దగన్ సదంగభూతిచేతి దాతిరీతి మెచ్చఁగా
ర్చ్చగొంటువాలుఁ గంటిఁ జూచ జూడఁ గంటి నొంటిమై. 8

ఉ. ఏమహీశావతంసమున కీనవమన్మథమూర్తి కిట్టి క
న్యామణి గల్గెనో యతివరాశ్రమమంజులకుంజపుంజమ
ల్కోమలియాటపట్టుగుటకుం గత మెయ్యదియోని సర్గలీ
లామధురంబు లీవెలఁదిలక్షణముల్ గణుతింప నర్హముల్. 9

ఆనడలా మెఱుంగుఁదొడలా జిగిపొక్కిలియా నితంబ మా
కానలయారు వాడిగువుగబ్బిజగా చనుగుబ్బలా గళం
బానవఁ గేలువా పెదవి యాకనుదోయి బెణంగులా కుచల్
గానజగంబునం గలవకంటి నొకర్తును గంటి నిర్వ్యథన్. 10

తలిరుం బోఁడినితంబబింబవిలసద్ధమ్మిల్లబంధంబుతో
బలభిన్నీలము పోరి పూరిఁ గఱచున్ బాహోధరశ్రేణివ
ల్వ్యాలఁ బాఱున్ గుముక్తి మదభ్రమరముల్ నెత్తమ్ములం జేరు నె
మ్మిలపింఛమ్ములు జాఱునంధతమసంబుల్ బల్గుహల్ దూఱెడున్. 11

ఉ. ముందుపసిండితమ్మిబలు మొగ్గల మొగ్గర మాపరించుమే
ల్చిందెడు వేల్పుగుబ్బలివజీరుని జీరు నధఃకరింపఁగాఁ
గ్రొందలిరాకుబాకుదొరకుం దొరకించు భవంబు చెల్లరే!
చందనగంధిచన్నుఁగవ చంద్రుఁడొ యింద్రుఁడొ యామహేంద్రుఁడో. 12

మ. స్ఫురదాపీనకటీరసైకతతటీసువ్యక్తనాభీసరో
వరమధ్యంబున రోమరాజి యనుశేవల్ బద్ధనాళాంకురో
త్కరముందోఁచివళీతరంగముల నూఁగంగుట్టల శ్రీపయో
ధరముల్ గ్రొవ్విరిలీలమోమకులచందంబక్కురుల్ గైకొనున్. 13

తే. కెంపురాఁ బోడితలిరుఁ బాయంపుగుణము, పచ్చపవడంపునిగనిగల్ భాగనియతిఁ
గూర్చి యమృతంబు పదనిడి ఘుటికఁ జేసెఁ, గాక విధియింత యొప్పునే కలికిమోవి.

సీ. కణఁకమూర్ధ్వాధరాంగవిధానమున ధాత, కరయంత్రణంబులఁ గ్రాఁగనోపు
నంతకంతకు నింతలైనగుబ్బలు విట్టి, వీఁగి పైఁ బడు నంచు డాఁగనోపు
జఘనభాగము ఘనస్తనభరం బని పొనఁ, గ్రోయమధ్యస్తమై తోలఁగనోపు
గురుకళత్రంబులఁ గూడినపరితాప, మెద కిగ్గమైన వహింపనోపు

తే. ఆహా! సకలాంగగౌరవంబావహించుఁ, దరుణిమంబూర్జితంబైన తరుణిమధ్య
మరయనరయంగ నతికృశంబయ్యె మనవి, కనుసరించిన మదిమానఁడనిమకరణి. 15

ఉ. కొమ్మ మెఱుంగుఁజన్నుఁగవకోల్తలభిన్నములైనయాత్మకుం
భమ్ములఁజూచి యాచవిసాబంగుఁ దొడల్ పొడరన్ పగర్చుహ
స్తమ్ములఁ జూచి తన్మృదుపదమ్ములు పుష్కరమూన వ్రాలునా
గమ్ములఁ బ్రోవబాలగజగామినియన్ బిరుదంబుఁ గైకొనెన్. 16

మ. ఒరవుంబూఁతపసిండిపంటినును మేనొయ్యారపున్ నాధ్యమున్
మెఱుఁగుం జెక్కులు తేనెలూరుపలుకుల్ మించుల్ పిసాళించువా
తెఱ విన్నాణముఁ గుల్కుముద్దుమొగమున్ దీర్ఘైన ఫాలంబు చి
త్తరపుంజాడ్కఁ వలుందగుబ్బకవ వింతల్ గూర్చెఁ దన్వంగికిన్. 17

వ. అని యివ్విధంబున. 18

ఉ. నీలనృపాలసూతిరమణీమణి సన్నిక సన్న వేచి దృ
గ్జాలము బాలఫాలఫలకస్థులఁ జెక్కులగుబ్బచన్నులన్
గీలుజడన్నడన్ దొడలఁ గేల్గవ మైఁదలమైనయందమున్
మేలిధనంబురాజునకు మెచ్చుగ ముచ్చిలినించె నెమ్మదిన్. 19

ఉ. బాలికమోముచందురునిపై మధురంబగుమోవిజుంటిపై
నోలిఘనస్తనస్తబకయుగ్మముపైననుఁ గేలుఁదమ్మిపై
హేలిగపోలపాలికలవందము గుల్కుజవాదిపైమహీ
పాలునివీక్షణభ్రమరిపఙ్క్తులు గంతులిడున్ జెలంతులన్. 20

వ. ఇత్తెఱంగున నక్కన్యకావపురుపరిసరదామోదవ్యతికరంబు లగునీక్షణమధుకరంబుల మరలింపఁ జాలక భూపాలతిలకుండు సంశయడోలాయత్తం బయ్యునుం జిత్తంబిగు రొత్తం గ్రొత్తమరులునం గెరలుచు నాత్మగతంబున. 21

క. చదురాడఁ బథ్యమనితోఁ, జదురాడనపత్యమనుచు సదమదమయ్యెన్
మదిరానన వశమైనా, మదిరాననవశమెమరులుమరలుపనింకన్. 22

చ. అకటకటా! మదీయహృదయంబు భయంబునయంబటంచు నెం
చక సుకలంకభావమునసంధిలు కణ్వమునీంద్రపట్టిపైఁ
బ్రకటతరానురాగమునఁ బాయకయుండుట చిత్రమయ్యెఁ గా
తుకమున నిందువంశజులు దుష్టవిచేష్టితముల్ భజింతురే. 23

మ. అసిధాత్రీవిభుఁ డంతఁగొంతపడి చింతాక్రాంతుఁడై క్రమ్మఱం
దనచిత్తమ్మున నిశ్చయించె నిటులేఁ దర్కింపనింకేల క
ణ్వనిలోకమ్మున నూర్ధ్వరేతుఁడవ విందుంగాదె యట్లౌటవా
యనఘుండీచెలి నెట్లుగాంచుఁగలదే యాకౌశచిత్రంబిలన్. 24

వ. అదియునుం గాక. 25

ఉ. అంకిలిగాదునాదుహృదయంబుతమోరహితంబునూవె నీ
కుంకుమబొమ్మపైనురుల్కొన్నవిధంబుఁ దలంచిచూచినన్
శంకిలనేటికీవెలఁదిక్షత్త్రపరిగ్రహపాత్రయైతగున్
మంకుఁదనంబులేనిఘనమానసవర్తనముల్ ప్రమాణముల్. 26

వ. అని వెండియు బహుప్రకారంబులం దర్కించుచు నక్కించిదవలగ్నయెడ లగ్నం
బగుట నుద్విగ్నంబై నిజాయత్తంబుగాక చిత్తం బక్కన్యకాసరససల్లాపసమాకర్ణన
కుతూహలంబునం బొదలం బొదలమాటునం బొంచి సమయంబుఁ బ్రతీక్షించునవస
రంబున నత్తెఱం గెఱుంగక యత్తన్వి యుద్యానసమన్వేషణంబు సేయుచు. 27

మ. తనయాప్రేమవివర్ధమానసరళద్రాక్షాలవంగాదినూ
తనశాఖిప్రతతీతతిన్ దడవి పాథస్సేకమున్ జేయఁగా
ననహూయాదులఁ బంచియున్నతనకై యారాజవర్యుండుపాం
చినయోలంబునఁ గన్నిగన్నెరుపొదం జేరెన్ యదృచ్ఛాగతిన్. 28

క. చేరువఁ జేరినవారిం, గారవమునఁ బౌరవుండు గనుఁగొనుచుండెన్
సారసముఖియారసికుఁడు, తారసమైయున్న సన్న దలకొనకునికిన్. 29

వ. కుసుమఫలభరానమ్రక్రమ్రతరతరునికరమ్ముల నలుగెలంకులం గలయం జూచుచు. 30

సీ. సరసులఁ గలఁచునంచలమించునడవడి, కడ్డగునకుదోష మలవరించుఁ
గన్నిమావులకొమల్ గముచుకోకిలముల, పగుపంపుఁగలరవార్భటివడంచు
ఫలభంగములుసేయుకలికిచిల్కలనోటి, పరుసఁదనంబువాబలిమిమాన్పు
నుమరసమ్మిల్లను జూఱలాడెడుతేంట్ల, లలిబిత్తరపుఁజూడ్కి నిలువరించు

తే. యానమునఁ బ్రౌఢిగాన విద్యలనిరూఢి, పలుకులసొబంగు వాలుఁగన్నులబెడంగు
తనరఁదనరాకవనదేవతలుభజింప, నాత్మవనవాటి మెలఁగుచు నవ్వధూటి. 31

వ. వెండియు. 32

చ జిలిబిలిఱెక్కలార్చుముఖచిక్కనముక్కునఁ బక్వదాడిమీ
ఫలయుగళంబునొక్కనొకబాలశుకంబురకంబుఁ జూచివా
బలిమినవల్చుచున్ విరులబంతి నెలంతుక దాని వేసెను
త్తలమునఁదప్పిదారియదితాఁకెన్నృపాలునిపెన్నురంబునన్. 33

క. దూరవుఁజూడ్కులనువ్విరి, బూరెడుసెడ విరులబంతి యురమునసోఁకన్
జారుముఖివైచెనదిగని, మారుఁడుధృతిఁ గరఁచెన్నృపతి మతిఁ దామఱచెన్. 34

తే. పొంచితానుంటయెఱుఁగక పొలఁతివైచెఁ, దవిలెవిరిబంతి చిలుకకుఁదప్పితన్ను
విధికృతంబైనయట్టియవ్వేడబంబు, కనికనినిజంబుదెలియఁ డమ్మనుజవిభుఁడు. 35

తే. ఆత్మవత్సర్వభూతాని యనువిధమునఁ, దామరులుకొన్నవాఁడయి తరుణిదన్ను

మరులుకొని చేరవచ్చి యమ్మానసూన, కందుకంబున నై చెనకాఁ దలంచి. 36

వ. మఱియును. 37

చ. పొలఁతుక దావపావకము పూరుషుఁ డాజ్య ఘటంబటన్న ప్రాఁ
బలుకు నిజంబుగా మనుజపాలుఁడు క్రొవ్విరిచెండు సోఁకినన్
గులుకుమిటారి గబ్బిచనుగుబ్బను రమ్మునఁ గ్రుమ్మినట్లు మి
న్నలమికొనుం బ్రమోదకృతహాసవచారుముఖారవిందుఁడై. 38

వ. ఇవ్విధంబునం గందర్పగోచరుండై యనురూపంబు లగువిలాసచేష్టితంబులం బొరలి యెట్టకేలకు నక్కళవళంబుదక్కి ధైర్యం బవలంబించి భూనాథుం డక్కందుకపాతంబు నిమిత్తంబుగా నమ్మత్తకాశినియన్వయనామగోత్రంబులునుం దదభిప్రాయంబునుం దెలియువాఁడై యి ట్లనియె. 39

చ. కలుషవికర్తనంబయిన కణ్వమహామునిదర్శనంబువాం
ఛితయిట రామనోరథము చేకుఱియెఁ దపస్విలేమిసం
ధిలుగమనశ్రమంబుఁ గడతేర్చుట కిచ్చట విశ్రమించితిన్
గలికిమిటారి! యిట్లు ననుఁ గందుకతాడితుఁ జేయఁ బోలునే. 40

చ. దంతురదంతిదంతములతాఁకునకోర్చినపెన్నురంబుపూ
బంతినగల్చునీయతనుబాహుబలంబున కగ్గమైపరి
క్రాంతుఁడనైతి నిందుకులసంజనితుం డను పౌరవుండ దు
ష్యంతుఁడ గుంతలక్షతమసారమణీ! రమణీశిరోమణీ! 41

క. ఓచెలి! యేనతిథిసప, ర్యాచరణార్థుఁడ నటంచు నాకస్మికమా
రాచదొరపలుకుపలుకుల, కాచిలుకలకొలికి యులుకు నలుకున్ బెలుకున్. 42

వ. ఇట్లా భూపాలుండు సాభిప్రాయంబుగాఁ బలుకుటయు లజ్జాభయపరాధీనరతయగు నమ్ముగ్ధ మధురగంభీరంబు లగు నాకస్మికమహీపాలాలాపంబుల కులికిపడి చకితకురంగశాబంబుకరణిం గ్రొళ్లుఱుకు బేడిసమీలకరణిం బ్రేక్షణప్రభాజాలంబులు నలుగడలం గడలుకొనఁ గొండొక పరిభ్రమించి పయోధరమధ్యంబు వెడలు మెఱుంగుఁదీగియ తెఱంగునం బొదలమఱుంగు వెలువడి యన్నరనాథుం డాసీనుం డై యున్న యన్నవసహకారభూరుహంబు చేరువకుం జని. 43

ఉ. కోరికలూరఁ గన్గొనియెఁ గుంకుమబొమ్మ పసిండిచాయలం
గేరెడు మేనివాని శశిఁ గేరెడు వక్త్రమువాని వెన్నెలం
గేరెడు నవ్వువాని హరిఁ గేరెడు మధ్యమువాని మన్మథుం
గేరెడు ఠీవివాని రవిఁ గేరెడు తేజమువాని నవ్విభున్. 44

సీ. చిగురాకుజిగి కాకు సేయునంఘ్రులవాని, రంభోరుగుంభోరురచనవాని
సురపొన్న నెరిఁ గొన్న సొబఁగుపిక్కలవాని, దృగబోధ్యముగ మధ్య మెగుచువాని

మొగరాలనఁగఁ జాలు నెగుబుజంబులవాని, బింబానుబింబాధరంబువాని
నలతమ్మిచెలువమ్ముఁ జిలుకుకన్నులవానిఁ, దొగవిందు బెగడొందు మొగమువాని
తే. హారగలకోరమీసలహాయులువాని, నొఱపు నెఱపెడు వెడఁదయుఱమువానిఁ
జక్కలను జక్కలను నఖస్ఫురణవానిఁ, గాంచి పులకితగాత్రియై కలువకంటి. 45

వ. ఇట్లదాటునం గదిసి యలసవలితంబులును ముహుర్ముకుళీకృతంబులును బ్రభానిర్నిద్రంబులును బ్రేమార్ద్రంబులును భావవ్యంజకంబులును హృదయరంజకంబులును నిమేషవిముఖంబులును క్షణక్షణాభిముఖంబులును లజ్జాలోలంబులును నగువీక్షణజాలంబుల మదనసుందరుం డగు నా రాజపురందరుం జూచి పంచశరసమాక్రాంతంబైన నిజస్వాంతంబు భయవినయలజ్జాసంభ్రమసంభ్రాంతం బగుటయు. 46

ఉ. బాలనృపాలు మ్రోలనిలువన్ ధృతిసాలక మేలిజాలువా
చేలచెఱంగు జాఱినను జెక్కు సెమర్పఁ గలోచనప్రభా
జాలము క్రేళ్లువాఱఁగఁ గుచద్వితయంబు చలింపఁ జొక్కుచున్
సోలుచు సారెసన్మరలి చూచుచుఁ జేరెనికుంజగేహమున్. 48

వ. ఇట్లు పేరలుంగునం బెదరినమదనకలహంసకామినీకామనీయకంబున నమ్మత్తకాశిని తోరంబగు కరవీరంపుటీరం బోలమాసగొని. 38

ఉ. పూచినకప్పురంపుఁ దిటిబోదెనుఱుంగునఁ జేరి మున్న తా
వై చినబంతి చేనతనివక్షము గందుట కాత్మ విన్ననై
యా చెలి రాచఱేచెలువు నందముఁ జందముఁ దొంగి తొంగి తాఁ
జూచుఁ దలంకు వెండియును జూచుఁ దలంకు మెఱుంగు చాడ్పునన్. 49

వ. ఇవ్విధంబునం జూచుచు నాత్మగతంబున. 50

సీ. ఏనవశీతాంశుబింబప్రసన్నవసుధా, విలసనంబు వహించు మవీనినగవు
స్ఫురదంతరమరాగపూరస్ఫుటోద్గార, గరిమంబుఁ గనువీనికావిమోవి
కాయకాంచనకూటస్కంధబంధురశాఖి, కారూపములు వీనిఘనభుజములు
నయనపద్మపలాశ నానటన్మధుకర, నికరాంచితము వీనిచికిలి చూడ్కి
తే. యహహ! విధుకులకలశవారాకరమున, నవయవస్ఫూర్తిమన్మూర్తివవతరించి
బాలికామానహరుఁడైన పంచశరుఁడొ, కాక కేవలుఁడే యీగుణాకరుండు. 51

ఉ. ఆనగుమోము మోము గదియందులకించుఁగదా యథాసుఖం
బానన మోవి మోవి గదియందిలకించుఁగదా ప్రతిక్షణం
బానునమేను మేను గదియంబులకించుఁగదా యహర్నిశం
బీనరనాథునాథునిఁగఁ జేయరుణాధరనోఁ చెనో మహిన్. 52

ఉ. ఈసుమకోమలావయవుఁ డీసుఖదర్శనుఁ డీసువర్చసుం
డీసులలాటుఁ డీసులభుఁ డీసుగుణాకరుఁ డీసుధాధరుం

ఉ. గాదిలి చిల్కపండుగొఱుకం దొరకొన్న తెఱంగెఱింగినా
చేదఱుకొత్తుక్రొత్తవిరిచెండునగండఱ నేయనే యుమీ
మైఁతవులంగఁ భోల్లునవమంజులవంజులకుంజపంజర
చ్ఛాదితులై భవాదృశులు చానలఁ గానలలోనలంతురే. 63

ఆ. కాదుబుద్ధికృతము గానిమ్ము కతిసమ్ము, గాదువిరులబంతి మేదినీశ !
దీనికింత ద్రవ్వితిరితగ నెట్లొకో, మిమ్ముఁ జేసికొన్న మెలఁతసుఖము. 64

క. ఈవైఖరినావెలఁదుక, భావాకూతంబు గాఁగఁ బలుకంబలుకన్
భూవల్లభుఁడా వేల్ల, ద్భావోల్లసదతనుతాపభరపరవశుఁడై. 65

వ. ఇత్తన్వి దైవానుగ్రహంబున నాయెడ బద్ధానురాగ యయ్యుం గానోవు లజ్జాభయం బులఁ గుఱంగట నిలువంజాలక మఱుంగునకుం జనునప్పుడు తరుకంటకసద్ధంబగుచే లంబు సడలించుకొను నెపంబున మరలి సాభిప్రాయంబుగాఁ జూచుచుం జనుటయు క్షమాపణంబు నెపంబున నాజ్ఞానువర్తినినై చరియింపం గలదాన నని యభిప్రాయ సూచనం బాచరించుటయుం గలిగియున్న యది యట్లగుట నారదవాక్యంబు సనుకూ డెంగాకేమి మదభిప్రాయసూచనంబున నిక్కలికిం గరఁగించి మనోరథంబు సఫ లంబుగా నెలకొనందగునని యమ్మహీకాంతుండు సాంత్వనస్వరంబున నయ్యింతితో నిట్లనియె. 66

క. ఇవ్వాలవవ్వాలఁబువ్వుల, క్రొవ్వాలపులఁ బొదలిపొదలి కొననేటికినీ
వెవ్వనిజవ్వనివివ్వని, దవ్వనివెఱచఱవ మెలఁగెదవు మేలు బళి!. 67

క. వాలాయంబుగనీయెడ, నాలోలం బయ్యెహృదయ మలికులవేణీ!
హేలారతులంగౌఁగిట, నేలెదవో కాకమరునకెర సేసెదవో. 68

సీ. జలజాక్షి నీతనుశ్రమవారిపూరమ్ము, పాద్యోదకమ్ముగాఁ బరిణమింతు
భద్రేభగమన ! నీ ప్రమదాశ్రుకణజాల, మర్ఘ్యతోయమ్ముగా నవధరింతుఁ
గలికి ! నీకడగంటిగరువంపుఁజూపు, లలరులసోనగా నందగింతు
నతివ ! నీయధరామృతాస్వాదంబు, సరసంపువిందుగా సమ్మతింతు
గీ. బంధరచనాచమత్కారభరితసురత, మానితాయాసనిశ్వాసమారుతమ్ము
హితజలార్ద్రానిలమ్ముగా నిచ్చగింతుఁ, గనికరమ్మునఁబంగారు గనికరమ్ము. 69

సీ. పరుషవల్కలచీరపరిధాన మెట్లోర్చె ?, నీమేను నవనీతకోమలంబు
మృగబాలకుశశిఖామిళనమెట్లు సహించె ?, నీయంఘ్రులభినవనీరజములు
బాలపాదపసేకపాత్రమెట్లువహించె ?, నీకేలుపల్లవశ్రీకరంబు
ప్రసవరేణుకరాళపవనమెట్లు భరించె ?, నీమోముదర్పణనిర్మలంబు
గీ. శీతలజలావగాహముస్నేహతువర, కందమూలపలాశాదికదశనంబు
సేయుటకునెట్లు దవరె? శచీవిలాస, మెన్నదొరఁకొన్న నీచిన్ని యిపురుబోణి!. 70

మ. చతురంభోనిధిమధ్యభూవలయపూజ్యప్రాజ్యసామ్రాజ్యశా
శ్వతదివ్యావ్యయనవ్యభవ్యముల నశ్రాంతంబు విశ్రాంతుఁడై
బలిఁగా నన్ను వరించియుంచితమహాభాగ్యమ్ముఁ గైకొమ్ము ర
మ్మతివా! నామతివాంఛఁ దీర్తువది మేలాలించిలాలించవే. 71

తే. అనినరాగంబుసిగ్గుమోహాతిరేక, మాభిజాత్యంబు సమ్మోదమతిశయిల్లఁ
బొదలమాటునవెఱనీటుపొదలమాటి, మాటికినిదొంగిచూచుచునుగునపలికె. 72

మ. గురుపత్నీ రతుఁడాసుధాకరుఁడుమీకూటస్థుఁడౌనాబలీ!
సరసాగణ్యులుమీరుమీకిదికులాచారంబు పారంపరీ
పరిపాటిన్ బలుకన్ విడంబనముగా భావించితిన్ మేలు మే
ల్గురుకన్యాపరిరంభణంబునకు సంకోచంబుమీకెట్లగున్?. 73

తే. నట్టడవిలోననన్నిట్టునట్టుపట్టి, గొట్టుమిట్టాడనేటికిఁబట్టభద్ర!
పుట్టునకుమున్నలేమకుబొట్టుగట్టి, చెట్టపట్టుటకొకరుండుపుట్టెఁజూవె. 74

శా. నాకున్నజ్జనకుండెఱుంగనివిధానంబెట్టుగావింపనౌ?
లోకుల్ మెచ్చరుమిమ్మునానితనయాలోలాత్మకుండంచును
శ్లోకుండైతగునాతకశ్యపుఁడునచ్చున్ మెచ్చునిచ్చున్ వనున్
మీకున్నాకుసరోరుహాసనుఁడు బల్మింగూర్చినట్లైనచోన్. 75

తే. అకట! గుడమిశ్రమగుపాయసాన్నమేని, సుడుకుజాతినరుచ్యమైయుండుటెట్లు!
తారతమ్యంబుభావించితరతమంపు, మేలుఁగైకొమ్ము కరుణనన్నేలుకొమ్ము. 76

వ. ఇవ్విధంబున. 77

తే. అధిపుఁడాలించియాలించి యభినుతింప, రమణి మందాక్షమందాక్షరంబుగాఁగ
ములకపలుకులనమృతంబుఁజిలికిచిలికి, చకితచకితాంగయష్టియైసంభ్రమించి. 78

క. ఉత్తరముం బ్రత్యుత్తర, ముత్తమముగనిటులనడపియుత్తమమాపై
నెత్తకచెలిమరలేఁదదా, యత్తఱిఁజిత్తమునమెత్తనగుచున్ నగుచున్. 79

వ. అయ్యవసరంబున. 80

మ. కలకంఠీ! వరవర్ణినీ! మదవతీ! గంధేభకుంభస్తనీ!
జలజాక్షీ! మృదుభాషిణీ! శశిముఖీ! శాతోదరీ! సుందరీ!
యలివేణీ! రమణీమణీ! కలికీ! తన్వంగి! మనోహారిణీ!
లలనా! రొచ్చటనొంటినుంటివనిగోలంజేరిరాళీజనుల్. 81

వ. తదనంతరంబు. 82

ఉ. కించిదుపజ్ఞనాత్మఁ బరికించితదాననచిహ్నముల్ విలో
కించితదీక్షణంబుపరికించితదంతరుగంతమున్వ్రత

రిక్కించితదంగయష్టిపులకించిరహిం మటఁజూచిచూచిశం
కించిభయంబుగూరఁదిలకించి ప్రియంవదలేనుకిట్లనున్. 83

ఉ. తోరములైనపూఁబొదలఁదూఱఁగనీసకలాంగకమ్ములె
ట్లోరిచెనమ్మ! భృంగములయుద్ధతినీవదనారవిందమే
తీరునవ్రచ్చెనమ్మ! విరిదేనెలసోనలరొంపులిల్లనీ
వేరహిఁదాఁటితమ్మ! యిటులేకతమేకతమేతలోదరీ!. 84

ఉ. నవ్వులు గావునీదువదనంబునవిన్నఁదనమ్ము హేతుకం
బెవ్విధిసంభవించె? నిటులెవ్వరునీకహితమ్ముచేసి? రే
యువ్వమిలేదు నావలననొక్కయెడన్ క్షమముబుజ్జగించినీ
విప్పవలీథినివ్వటిలనేమికతంబు? నితంబినీమణీ!. 85

వ. అనిన నక్కన్యారత్నంబు కొండొకభావించి కించిదంచితలజ్జాసజ్జితహృజ్జలజంబు గాఁ
ప్రియంవదతో నిట్లనియె. 86

ఆ. మేలుదలిపికొంటివాలీశిరోమణి!, వింతలేనియావులింతగలద
చెలియతెలియవినుముచిత్తదౌర్బల్యంబు, దీటఁగలతెఱంగుఁదేటపఱుతు. 87

మ. లలనా! భూలలనావరుండొరుఁడు కేళాకూళికామాలికా
కలనాపుష్కలపుష్కరప్రకరచంగద్భృంగచంగాంగనా
కలనాదామృతవీచికావలనజాగ్రచ్చిత్తచక్రాంకుఁడై
యలనాళీకశరుండునుంబలెఁ బ్రమోదాపాదియయ్యెన్ రహిన్. 88

క. పేరనదుష్యంతుండఁట, కౌరవబాంధవకులాగ్రగణ్యుండఁటక
ణ్వారాధనకుతుకమునిం, డారఁగవచ్చెనఁటయేతదాశ్రమమునకున్. 89

తే. అతనిమొదనొక్కయపరాధమాచరించి, చింతిలుచునున్నదాననోచివురుఁబోణి!
చేతివిరిబంతిమాచాయఁజలుకనేయఁ, దప్పియారాజువత్సంబుదాఁకనదియు 90

వ. అనినంబ్రియంవద భయంబొదవ నమ్మదవతిం జూచి. 91

మ. లలనా! మవ్వపుజవ్వనంబులతిబాలత్వంబుతత్త్వంబుగా
విలుకాండాదృకుఁడీవ్యక్రమముదానిందావిగర్హించినం
బలుగాకల్ బలుగాకనీయుదుయ సెప్పం జెప్ప నిట్లోప్పముల్
దలుపంబోలని? రాజరాజతఁడుమేలత్మేలె? హేలావతీ!. 92

తే. శాకతల్యపుఁదరుగుమఁదరుణి! నీకు, నేమువినుమంత దుష్యంతుఁడిటకువచ్చి
నర్ఘ్యమిమ్మనిబోధింపనతనిపెంపు, తెలియదఁటొ? తల్లి! హేలావతీమతల్లి!. 93

వ. అనుచుశకుంతలన్ మిగులవాడిప్రియంవదరాజాపాలికిన్
జనితగనర్ఘ్యపాద్యములసత్క్రియలం బ్రియమాచరించియు

ట్లనియెవసుంధరాధరశశాంక! విశంకటవృత్తి నిత్తఱిన్
గనుఁగొనఁగంటిమాశ్రమని కాయకుభాయకునిన్నుఁగన్నులన్. 94

తే. పాలవంటికులంబునఁబరఁగుసోముఁ, డమ్మహాబాహుసంప్రద్వాయమునఁగీర్తి
నెసఁగ మెసఁగెడువాఁడగర్భేశ్వరుండ, వతిథివైతివి పావనమయ్యెవనము. 95

వ. అని బహుప్రకారంబుల నభివందించి మఱియు ని ట్లనియె. 96

ఉ. ఇంతి యవల్పఁగా బెదర కిట్టటు గ్రమ్మరు చిల్కమీఁదఁబూ
బంతిరటాప వైవ గుఱి వాసియయారె! దయారసార్ద్ర! దు
ష్యంతమహీప! నిందవిలె శాంతిమెయిం గరుణింపుమయ్య! య
శ్రాంతమహాపరాధములు సైఁపభవాదృశు లర్హు లిమ్మహిన్. 97

వ. అని యివ్విధంబున క్షమాపణంబు లగువాక్యంబులం దన్నుఁ బ్రార్థించునక్కన్యాసహచరిం జూచి యజ్ఞానకృతం బగునిక్కార్యం బవార్యంబని కోపింప నంతవెడంగులమె యది యట్లుండని మ్మిక్కాశ్యపులూర్ధ్వరేతులగుట జగత్ప్రసిద్ధంబై యుండ నివ్వనంబున నీజవ్వని నివ్వటిలం బనియేమి? యిక్కామినివృత్తాంతంబంతయు వినవలతుం జెప్పుమనిన నమ్మహారాజుతోఁ బ్రియంవద యి ట్లనియె. 98

సీ. అలగాధిసుతుఁడాగ్రహగ్రహావిష్టుఁడై, యావసిష్ఠులగెల్వ నలవిగాక
సరవిబాహుజబాహుజనముగర్హించుచు, బ్రహ్మర్షిభావంబుఁ బడయఁ గోరి
హిమవదుత్తరతటాశ్రమసీమ నివసించి, దృఢతరనిష్ఠాగరిష్ఠుఁడగుచుఁ
దపమాచరింపఁ దద్దారుణానలశిఖల్, కడుకొనినభమెల్లఁ గలయఁ బ్రాఁక
గీ. దివిజసంగంబు భయమున దేవవిభుని, మఱువుసొచ్చిన నమ్మహామహుఁడు దాని
విఘ్నమునకునుపాయంబు వెదకిమేన, కాహ్వయముఁ దాల్చునచ్చరనామతించి. 99

శా. విశ్వామిత్రతపఃప్రభావకలనావిర్భూతఘోరాగ్నిచే
విశ్వంబెల్లఁ దలఁకుచున్నయదినీవిన్నాణముం జూపుమా
విశ్వాసంబొలయించి యమ్మునితపోవిఘ్నంబు గావింపుమీ
శశ్వత్కీర్తివహింతు వీవుధరనాచంద్రార్కముం గోమలీ. 100

చ. అనవిని మేనవిన్ననయి యారసి యారసికావతంసుతోఁ
గనుకనిఁబల్కె గోపనుఁడు గాధిజుఁ డాధిజనింపఁజేసెడిన్
గనివిని మీరుపంపఁ జనఁగావలెఁ గావలె సత్సహాయముం
బనుపనగున్ సమీరణకుమారుని మారుని నమ్మధున్ విధున్. 101

వ. అనినఁ బ్రీతుండై పురుహూతుం డి ట్లనియె. 102

క. కంతుం బంతున్ రజనీ, కాంతుం బంతుం బ్రమోదకరు గంధవతీ
కాంతుంబంతున్ మ్రోల వ, సంతుంబంతున్ లతాంగి! చనుమని పనిచెన్. 103

తే. అట్టులాలించి యనుపనయ్యలరుఁబోఁడి, యొడలితళుకున మురిపంపునడబెళుకున

గ్రొమ్మెఱుఁగులీల రాయంచకొదమభాతి, వెడలెఁ దెఱుఁగంటి వేలుపుఁ గడిఁదిప్రోలు. 104

వ. అట్లు వెలువడి శీఘ్రగమనంబున. 105

సీ. సురసరిత్పరిసరస్ఫురదురస్సరపుర, స్సరదురుత్తరమరుత్తరువరంబు
దినదినస్తనితనిస్వనకనన్మునిమనః, పనితనూతనఘనాఘనఘనంబు
కలభలిట్కులచలచ్ఛలదలస్థలదల, ద్దలమిలజ్ఝలజలజ్ఝలజ్ఝలంబు
ప్రవణవజ్జవనవత్పవనవన్నవనవ, శ్రవణవత్స్వపనవిప్లవపదంబు
తే. గజగవయగండభేరుండఖడ్గచమర, శరభశార్దూలశంబరశల్యవృకవ
రాహసింహావలీముఖప్రముఖదుష్ట, సత్వముఖరంబుఁ గనియెఁ దుషారనగము. 106

వ. కాంచి విస్మయావేశంబునం దదుత్తరతటంబునం బ్రవేశించి. 107

క. అందుం గలల కందువలకుఁ, గందళితంబగుచు హృదయకమలం బలరన్
సుందరిమునిమందిరమగు, చుందిరమగు నాశ్రమంబు జొరఁ జొర నెదుటన్. 108

సీ. తపముపెంపునఁ దోఁచు దహనకీలములతో, జటిలంబులగుపల్లజడలవాని
భసితాంగరాగసంపదలసొంపదలింపఁ, దగువళీవలితగాత్రంబువాని
మైఁబుట్టుపుట్టకోమలచీమలెగఁబ్రాకి, మార్పనేర్పనిలోమములవాని
వ్యాఘ్రాజినోత్తరీయము మేచాయగా, బలుమొగంబునఁ బొట్రుపలుచువానిఁ
తే. గందమూలాది కాశనకాయశోష, ణోగ్రదష్టాంగ సంగతయోగభాగ
పావనబ్రహ్మఋషిభావభావనాప్ర, తీతదీక్షావిధేయు గాధేయుఁ గాంచె. 109

వ. ఇత్తెఱంగున నతిఘోరతపశ్చరణపరిణతదీక్షాలక్షితచరిత్రుం డగువిశ్వామిత్రుం గాంచి
తత్తేజోవిశేషంబునకు సాధ్వసంబు ఱెట్టింప నన్నిలింపగణికాలలామంబు. 110

క. కనుఁగొనుఁ గనుఁగొని మునుకొను, మునుకొని మునుకొనక వెనుక ముందై కుందున్
మునుతనుపనిచినపనికిం, గొనకొనుఁ గొనకొనదు తపసి కోపనుఁ డనుచున్. 111

వ. వెండియు. 112

ఉ. భూరితపఃప్రభావమున భూవలయంబు నభంబుఁ గాఁచుమన్
జేరను జెందనుం బ్రణతిసేయను శక్యముగానిమౌని నే
నేరహిమారుబారికెలయింపుదు నట్లని ప్రోలు క్రమ్మరం
జేరినవాసవుం డలుగుఁ జింతితకార్య విపర్యయంబుగాన్. 113

తే. అమునినాథుండు లోకహితార్థమనుప, శక్తియుక్తులనదివురాని సంఘటింపఁ
బిదపనైనైనఁ జేరను బెంపుగలుగు, దవ్వుదవ్వుల వెఱఁవూనితలఁకు కెట్లు. 114

తే. అనుచు భావించి భావించి యలరుఁబోఁణి, గాఢనిశ్చయమున మనఃకనుల మలరఁ
జెలులుఁ దానువిలాసవిచేష్టితముల, గాధిజునిమ్రోలఁ గ్రీడించెఁ గలితనమున. 115

సీ. నృత్యన్మయూరికానికురుంబమునఁ జేరి, నగుమన్నృత్యము సేయుఁ నలినగంధి
ధావన్మరాళికాతల్లజంబులఁ జేరి, గతులవైఖరిఁ జూపుఁ గలువకంటి

ప్రతిపదశారికాపరికరమ్మునఁ జేరి, మధురమ్ముగాఁ బల్కు మంజువాణి
కూజద్ద్విరేఫికాకులకమ్ముఁ జతఁ గూడి, శ్రుతివిభాగ మొనర్చు సుందరాంగి
తే. సవిధమధుమాసవాసరోత్సవవిశేష, లసదలంకారముకుళపలాశకుసుమ
ఫలభరానమ్రపాదపపటలజటిల, గాధిజాశ్రమసీమశృంగారగతుల. 116
వ. ఇవ్విధంబునం గొండొక పరిభ్రమించి. 117
మ. నెలఁతల్ దాను సురాపగాజలములన్ నీరాడికై సేసిత
త్పులినస్థానమునందుఁ గ్రొవ్విలపుగాడ్పుం గూన పైవీవఁగా
లలిఁ గూర్చుండి విపంచికారణనముల్ రాజిల్లనయ్యప్సరః
కలకంఠీతిలకంబు సేయఁదొడఁగెన్ గానంబనూనంబుగన్. 118
క. వీనులవిందై నిలకొను, గానామృతమానెమానెఁ గౌశికుఁడు నిజ
స్నానంబున్ మానంబున్, ధ్యానంబున్ మొదలుకొనువిధానంబెల్లన్. 119
వ. ఇట్లాలించి యాత్మగతంబున. 120
క. కాదలికులఝుంకారము, కాదలకోకిలరుతంబు కమనీయసుధా
సోదరమిన్నాదరసం, బాదరణీయముయదీయ మనికను దెలిచెన్. 121
వ. ఇట్లమ్మునికులాగ్రేసరుండు నిమీలితలోచనుండై నలుగడలం జూచు నవసరంబున. 122
ఉ. సోమునిలేమభాతిఁ బరిశుద్ధసువర్ణశలాకచాడ్పునన్
గోమలకల్పవల్లివలె గుమ్మనుకుంకుమబొమ్మకైవడిన్
గామునిహేతిరీతిఁ దొలుకారుమెఱుంగు తెఱంగునన్ లతాం
గిమణిదోఁచెఁ గట్టెదుటఁ గేవలమున్ వరదేవతాకృతిన్. 123
ఉ. ఆసమయంబునన్ మదనుఁ డగ్గలికం గళికాముఖంబులై
భాసిలుతూపులన్ హృదయపద్మము లక్ష్యము సేసియేసినన్
గాసిలి కౌశికుండు తమకంబునఁ దన్ గనుసన్న చేసి యు
ల్లాసము వెల్లివిఁగ సఖులన్ నిలువన్ నియమించి గ్రక్కునన్. 124
మ. సలుకుల్ దేనియ లూరఁ గొనుములియం బాలిండ్లు పొంగారఁ బొం
దలుకుం బయ్యెద జాఱ వేణి పొరలన్ దాటంకరత్నద్యుతుల్
కులుకుం జెక్కులఁ జేరఁ గన్నులబెడంగుల్ మీఱ నయ్యప్సరో
లలనాఁ తన్ముఁ వచ్చి గాధిజునిమ్రోలన్నిల్చె నమ్రాంగియై. 125
ఉ. అంచితభక్తియుక్తి వినయమ్మున యన్మునిఁ గేలుదోయిజో
డించి నమస్కరించి నెఱికీవి వలిర్పఁగ మ్రోలనిల్చినన్
గాంచి మహామహుండయిన గాధితనూజుఁడు కూర్మిపేర్మి దీ
వించి లతాంగి! నీవెవతె పేర్మి వేకలఁ గెన్ నినుం గనన్. 126
వ. అని సాభిప్రాయంబుగా నడుగుటయు సమ్మదమ్మున నమ్మదవతి యమ్మునితో నిట్లనియె.

క. మేనక యనిపిలుతురవను, మౌనికులాగ్రణీ! తిలోత్తమా హేమాదుల్
వానిచ్చెలులేమచ్చర, చానల నెందేని వేడ్క సలుపుదు మురహిన్. 128

క ఎక్కడిమీరెక్కడిసే, మెక్కడి రతి పరమమునుల కివియుంగలవే?
మ్రొక్కెడిదీవించుటకై, యెక్కటి రానిట్లు పలుక నెల్లిద మైతిన్. 129

క. సామాన్యలఁ గామమ్ముం, గామింపకుఁడే మునూఱు క్రతువులవానిం
గామోపభోగములకుం, గామింతుమునూనిజంబుఁ గనుఁగొనుమనఘా! 130

క. పావనభవదంఘ్రిద్వయ, సేవనమునువిమలకమల శిశిరనభస్వ
త్సేవనముఁ దొరఁకొనునిట, నీవనమున మెలఁగువార మీరలుగకుఁడీ. 131

తే. అనుచుఁ బ్రతికూలవాక్యంబు లతివపలుకఁ, జిలుకబాబావజీయందు చిలుకములుకు
టలుకుటంపఱతాఁకునవనలనిసాలనీ, ధీరవర్తన మెడలి ప్రార్థింపఁదొడఁగె. 132

సీ. తతిపివెన్నెలవేఁడి తలఁకించెఁగలికి! నీ, యధరాధరామృతం బానసిమ్ము
వలపుఁ దెమ్మెరకూన వడఁకించెమగువ! నీ, కులుకుపైఁటచెఱంగుఁ గప్పనిమ్ము
విరికటారపుజోదు వెఱపించెవెలఁదినీ, కుచదుర్గములహత్తుకొనఁగనిమ్ము
పికశుకనికరమ్ము బెదరించెనతివనీ, సాహాయ్యమునఁ గేలి సలుపనిమ్ము
గీ. జలదళఫలానిలాహారసదుపవాస, చిరతరవ్రతదీక్షావిశేషశుష్క
దవయువాయాపమునభావ మలసమయ్యె, బాలనీప్రేమశీకూర్పఁ బడయనిమ్ము. 133

వ. అని యనేకప్రకారంబుల. 134

శా. ఈజాడం గరఁగించుచుం గృపణుఁడై హేలావతిం వేఁడుచుం
జేఁజేతం దెమలింపఁ జూఁచిహసితస్మేరాననాబ్జంబుతోఁ
గూజన్నూపురఘంటికావళులతో ఘుష్యన్మరాళీగతిం
రాజీవాననయిట్టటుం బెనఁగె దూరం బైనదీరంబునన్. 135

క. మెలఁగుం దలఁగుం భయమునఁ, గలఁగుం మలఁగుం లతాంగి కపటారభటిం
జెలఁగుం వలగొను నెవతున, నలఁగుం దొలఁగుంనగు న్వయారముమీఱన్. 136

వ. ఇట్లమ్మునిగృహీతం బగునిజకరాబ్జాతంబు సడలించికొని శరీరంబులయీరంబులను, దమాలంబులరోలంబులను, లవలీకుంజంబుల పుంజంబులను, ద్రాక్షాకాయమానమ్ముల వితానమ్ములను, తిలకమ్ములకులకమ్ములను గాసారంబులతీరంబులను, గిరితటంబుల నికటంబులను బరిభ్రమించు నక్కవంబునఁ జేఁజిక్కక చిక్కులఁ బెట్ట నెట్టనఁ గాధిపట్టి యిట్టట్టుఁ జుట్టివచ్చి చెట్టఁబట్టి పట్టుపఱచుచు నిట్లనియె. 137

కవిరాజవిరాజితవృత్తము.—

కలఁకలు సేయకువే కలికీ మదిఁ గ్రాఁగకొనవే మరుఘూములికీ
కొలఁకులఁ గ్రుంకకువే యబలా మదిఁ గొంకకువే భృతకామబలా

కలఁకులఁ డాఁగకువే లలనా! వెదకింపకువే కనుఁగోఁగలనా
పిలుగులఁ బెట్టకువే రమణీ! ననుఁ జేకొనవే గుణహీరమణీ!. 138

తే. అనుచుఁ బ్రార్థించి దౌహృదం బవధిగాఁగఁ
గూడియుండుట కోడఁబడి కుసుమగంధ
సంయమీంద్రునితో వచ్చి సహచరీసు
కల్పితంబైన కిసలయతల్పమునకు. 139

వ. ఇట్లయ్యప్సరోలలనామణిహస్తంబు నిజహస్తంబునం గీలించి యనల్పకల్పితానల్పంబగు కిసలయతల్పంబుఁ బ్రవేశించి తపఃప్రభావంబునం దదనురూపం బగురూపంబు గైకొని మన్మథరాజ్యపట్టాభిషిక్తుఁడై విశ్వామిత్రుఁడు. 140

సీ. జిలుఁగుపైఁటచెఱంగుఁ దొలఁగించి తొలఁగించి, యుదుటుగుబ్బలగోయలూనియూని
బిగువుఁ గౌఁగిటిలోన సాగయించి సాగయించి, సవురుగా మోఁదీవ నివిరి నివిరి
కదిసి మోమున మోముఁ గదియించి కదియించి, యొఱిమి వాతెఱ తేనె లాని యాని
కేళిమైఁ దమకంబుఁ గెరలించి కెరలించి, కళలూర మరుకేళిఁ గలసి కలసి

గీ. సొలసి సొలసియుఁ బ్రమ్మఱ నలఁగి పెనఁగి, యెడలిబడలిక వాయ నయ్యువిద సేయు
నంగసంవాహనంబున కలరి యలరి, కడపె నారాత్రి సుఖితుఁడై కౌశికుండు. 141

వ. ఇవ్విధంబున. 142

క. సురతిరుపరికరధరణీ, ధరవరశిఖరస్ఫురల్లతాభవనమునన్
జిరతరరతరాగంబున, సురతరుణిం గూడి మౌని సుఖమున నుండెన్. 143

తే. అంతఁ జలచలపిదపిదమానుచునని వి
కలలమైవిప్పువాఱుమఁ గరుడుగట్టి
తలదలిర్పఁగ గర్భమై తరతరంబ
నిలవుసలెఁ జీరచిక్కఁ నన్నలఁత కథప!. 144

వ. ఇట్లు గర్భంబు నవమాసపూరితం బగుటయు. 145

క. రాజర్షివలననిర్జగ, రాజవధూతిలకమునకు రమణీయంబై
రాజిలులగ్నంబుననీ, రాజాననగలిగె ఖచరరాజి నుతింపన్. 146

వ. అమ్మెయి నమ్ముని నిమ్మనంబునం బమ్మినసమ్మదమ్మున నక్కూఁతునకు జాతకర్మాదిసంస్కారంబులు నిర్వర్తించినం గాంచి యమ్మత్తకాశినిమెత్తమెత్తన నత్తపోధనుచిత్తం బారాధించి ప్రథమాధిగమంబునం జేసికొన్న సంకేతంబుఁ జెల్లించితి నింక యథాకామంబుగా వర్తింపంగలదాన నట్లగుట నాశ్రితరక్షావిచక్షణంబు లగుకటాక్షవీక్షణంబుల నన్నుం గృతార్థంగావించి వీడుకొలుపం దగునని సప్రణయంబుగాఁ దచ్చరణంబులకెరఁగి పొత్తికల నత్తమిల్లినయయ్యాత్తానకాయినిం దనపాదిఁగిట నిడుకొని సవినయంబుగా సన్నిధి నిలిచియున్నమరున్నటీతిలకంబు దెసం దేఱి చూచి యట్లకాక

యనుచు సంతోషంబడి తత్కరతలంబుల మణిశిలాశకాకారంబునం బొదలుతనయం
దనయంకతలంబునకుం దిగిచికొని బాష్పసలిలలోచనుం డగుచు మూర్ధఘ్రాణంబుఁ
జేసి మునుఁగేల చిబుకంబు నిమురుచు మేనకం జూచి యిక్కన్య చంద్రాన్వయప్రదీపకు
నకు నగ్రమహిషియై చక్రవర్తిలక్షణలక్షితుం డగుకుమారుం బడసి చతురుదధివేలా
వలయితసామ్రాజ్యసౌఖ్యం బనుభవించుచు నుభయకులంబులకుం గీర్తిపౌరుషంబులు
సంపాదింపంగలయది యట్లగుటం బహుప్రయత్నంబున దీని సురక్షితం గావించునది
యని క్రమ్మఱ నిబ్బాలిక నమ్మేనకకు నొప్పంజెప్పి గాఢాలింగనాదిసత్కారంబుల
నుపలాలనం బాచరించి యయ్యచ్చరవాల్గంటిం బ్రియంబున వీడుకొల్పి తానును
యథాపూర్వంబుగాఁ దపోనిష్ఠాగరిష్ఠుండై యుండె మేనకయుఁ బ్రియపుత్త్రింగైకొని
యేతదాశ్రమసమీపంబుఁ బ్రవేశించి. 147

చ. పొనుపగుమాలినీసలిలపూరముచేరువఁ జూచు సైకత
స్థలమునయిన్ సుజాతజలజాతమృదుచ్ఛదశయ్య నాత్మలో
నలుకకకూఁతుడించి విరహించ్చరమిన్నులఁ బ్రాఁకెభోగినీ
లలనలకేలపిల్ల తవులం బనుసామెత నిక్కువంబుగాన్. 148

ఉ. ఆదటతాతకశ్యపుఁ డహర్ముఖమున్ గనిమాలినీనదిం
బ్రోదిజలంబులాడుటకుఁబోవఁగ నొక్కెడ నొక్కబాలికా
రోదనమున్విని బడినరోయుచుఁ దామరపాకుపాత్రికం
బోదనలేక యట్లొరలుపూపమిటారినిఁ జూచియార్తుఁడై. 149

క. ఎవ్వరిబాలారత్నం?, బెవ్వఁడుజనకుండు? జననియెవ్వతె? జననం
బెవ్వలన? దీనిఁగొననే, నెవ్వఁడ? నిట్లనుచుఁ ద్రోయ నిట్లగునడవిన్?. 150

తే. అనుచుసందేహడోలాయితాంతరంగుఁ
డగుచుఁ దనయోగదృష్టినయ్యాఁటనిసువు
పుట్టినతెఱంగుఁగనుఁగొని ప్రోదిఁ బెనుచ
వాంఛనూహింపనశరీరవాణిపలికె. 151

క. మేనకకుగాధిజునకున్, మానుగనుదయించెదీనినునుపందగుఁద
త్సూనుఁడునీదౌహిత్త్రుం, డౌనుభయాత్రాతజనకుఁడనుమడిచివనే. 152

వ. అని మఱియును. 153

క. కుంతిలముఖరాజవధూ, కుంతలకాశ్మీరదానగుణచణబాహా
కుంతిలసనయశరీరశ, కుంతలయనిదీనిఁ బేరుకొనిరెమునివినన్. 154

వ. తదనంతరంబ. 155

తే. పుట్టుబ్రహ్మచారిపుత్త్రమిత్త్రకళత్త్ర, యోగభోగరహితుఁ డూర్ధ్వరేతుఁ
డహహ! దైవఘటనమాపిన్నపాపమే, నలమికొనుచుముద్దులాడఁదొడఁగె. 156

వ. ఇట్లు విశ్వామిత్రతపఃప్రభావంబునం గ్రవ్యాదగోచరంబుగాక శకుంతరక్షితయై
నవనలినపలాశతల్పంబునం బొరలుచున్నయక్కన్యకాలలామం దనపొదిఁగిటఁ బొదివి
కొనివచ్చిపర్ణశాలం గుశాస్తరణంబునం బదిలంబుగ నిడి యథాశక్తిం బెనుచుచున్నం
దెలసి యదితియుం గశ్యపప్రజాపతియు నన్ననసూయయుం దక్కటి పరిచారికా
జనంబునుం బనిచిన నేమునుం గులపతిం గాంచి తదనుమతినిక్కాంచనగాత్రిం బెను
చుచున్నవార మిదియిక్కలికి జన్మప్రకారంబు. 157

చ. అనవిని భూవిభుండు దరహాసవికాసవిలాసభాసురా
ననవనజంబుగాఁ బలికె నాతి ప్రియంవదవే నిజంబుగన్
జనవుననింపునింపుమనుసారకుసారకు ధీరధోరణిం
బనిగొనిపల్కుపల్కుల సభాజనభాజనమయ్యెడెందమున్. 158

తే. అనుచుమునికన్యకావృత్తమతివ తెలుప, వినుచు నానందరసమున విభుఁడు మెచ్చ
నట్టియెడఁ గర్ణతాడితంబయ్యె బహుళ, హళహళంబగువాహినీకలకలంబు. 159

వ. అయ్యవసరంబున. 160

ఉ. సైనికసింహనాదములుసామజబృంహితముల్ తురంగహే
షానినదంబవక్రరథచక్రపరిక్వణనంబుఘోరమై
వీనులఁగ్రమ్ముదేరఁజెలివేమరలెన్ మరలెన్ సఖీజనం
బానరనాథుఁడున్ మరలెనాత్మచమూవినివేశనార్థియై. 161

వ. ఇత్తెఱంగున నాశ్రమంబువెలువడి నిజసైనికులకుం బొడసూపి తదాశ్రమంబునకు
సమ్మర్దంబుగాకుండునట్లుగా నిజస్కంధావారంబు విడియింపంబనిచి తన్మధ్యం
బునం బటకుటీరం బెత్తించి విచిత్రాస్తరణశోభితంబును బ్రలంబమణిమాలికాలం
కృతంబును గృష్ణాగరుధూపధూపితంబును నై మనోహరంబగునప్పటమండపంబునం
గిసలయతల్పంబునం బవ్వళించి యమ్మునికన్యకాసమాగమోపాయంబుదొరకొనక మనో
జవేదనాదోదూయమానమానసుండై కొండొకవినోదంబులం బ్రొద్దుగడపుచుండె నంత
నక్కడ. 162

క. ఆనరనాథునిచెలువము, మానసమునఁ బొందుకొనఁగ మానినిసఖులుం
దానై యుద్యానంబున, సూనాపచయంబుసేయుచున్ విహరించెన్. 163

వ. అయ్యవసరంబున 164

ఉ. తమ్ములతావితానములఁ దావలమైవలమైన గాలితో
యమ్ములకామతింపఁజటులాలసలై వనకేళిసేయఁగాఁ
దమ్ములతావితానములఁ దావలమైవలమైన గాలితో
యమ్ములకామతింపఁజటులాలసలై వనకేళిసేయఁగన్. 165

ఉ. గమ్మనుతమ్మిసెమ్మెగముకెల్వలు కన్నులుకప్పవిప్పలం
బమ్మినవాఁచుకొప్పు నెడఁబాయని జక్కవగుబ్బచన్నులం
గమ్మని తేనెమోవిబిసకాండభుజమ్ములు నొప్పమీఱఁగాఁ
దమ్మునపోలియొప్పునొకతమ్మికొలంకువుగాంచియచ్చటన్. 166

తే. కొమ్మలందఱురతనంపుసొమ్ములూడ్చి, నూనరజములుసోఁకినసాలవుమేను
లమరఁగంటుబదీసిదుమ్మాడినట్టి, మసనిమదమేనుఁగులరీతిసరసిఁజొరఁగ. 167

చ. అడుగులనంటియూరువులనానినితంబములందినాభినిం
బుడికివళుల్ స్పృశించికుచముల్ వడిముట్టిసరోవతంసమ
ప్పుడఁతులఁగూర్మికానివలెబంధురకంకణకర్ణికావళిం
దడవుచునిల్పికైకొనియెఁదన్మయతం బ్రతిబంధవైఖరిన్. 168

సీ. ఒకతెమవలిగుబ్బనొగిమృణాళముఁజుట్టి, తారుణ్యకలశాబ్ధిఁదరుచునొకతె
యొకచానకనుబెళ్కులోలమీనమ్ములుగట్టి, హాయలుగాఁజేయుఁదలూసునొకతె
యొకతన్విమృదుహస్తమూఁదియుప్పలఁద్రొట్టి,పద్మానుభావమేర్పఱచునొకతె
యొకచామలసదూరువుదవ్వారమున మెట్టి, మకరేభకలహంబుమనుచునొకతె
గీ. యొకలతాంగినిజేయీఁత నోటుపఱిచి, పీనులంటిజయశ్రీలఁ బూనునొకతె
సఖులుదానుశకుంతల జతలుజతల, నతులగతులజలక్రీడలాడునపుడు. 169

క. వేడుకమీఱఁగజలకము, లాడిసరోవరమువెడలి యన్యోన్యంబున్
దోడయికై సేసిజల, క్రీడాలసలగుచునలరించిరి తొడవుల్. 170

చ. కులుకుమిటారిచన్నుఁగవఁ గుంకుమసంకుమదానులేపమున్
వలుకులప్రోవు నెన్నుదుటఁ దామరసోదరరేణుచిత్రకం
బలికులవేణివేణి నవహాటకపింజరిమంజరీతతిన్
గలికిపిసాళికన్నుఁగవఁ గజ్జలమున్ రచియించి రచ్చెలుల్. 171

చ. పొలుపుగజాఱువాపపిఁడిపుట్టముగట్టి జగానిగారపున్
మెలఁపులపైతళింతొడగి మేని మెఱుంగులతారహారర
త్నవలయాదిభూషణకదంబవిడంబన ముల్లసిల్లన
త్తిలకినియొప్పమీఱె సపిదీరినమారునివాలుపోఁకన్. 172

వ. ఇవ్విధంబున నలంకృతలై. 173

ఉ. తామరసచ్ఛదంబున ముదంబున వ్రాసిరి చేసిరి స్నితిన్
గామునికామునీయముసు గాదిలిచిల్కవాహుమాసుమాళమున్
సోమునిసౌమనస్యమును జొక్కులయక్కులనంబు చందనా
రామలలామశైలశిఖరస్ఫురదాతతవాతపోతమున్. 174

వ. ఇట్లు లిఖియించి కిసలయపీఠంబున నక్కమలపలాశంబు నిలిపి నిభృతరూపంబుల సన్నిధిం గూర్చుండి. 175

ఉ. మొల్లలమెట్టదామరల మోదుగుమొగ్గలఁ బొన్నపూవులన్
మల్లెలఁ గన్నెగన్నెరుల మామిడిగుత్తుల రాచకల్వలన్
హల్లకమాలికావళులనంబురుహాళినివాళిఁ గేళినీ
వల్లభుఁ బూజచేసి రభివంగనపూర్వముగాఁ దలోదరుల్. 176

వ. ఇవ్విధంబున ధ్యానావాహనాదిషోడశోపచారంబుల శంబరారిం బూజించి సఖీజనంబు శకుంతలం జూచి యిక్కాముం గామితార్థంబు సమకూర్పం బ్రార్థింపుమని యాదేశించిన నక్కన్యాలలామంబు మ్రొక్కి మనంబున నిట్లని వినుతించె. 177

ఉ. అయ్య! రమాతనూభవుఁడవయ్య! మహానటునోర్చుమేటివి
వయ్య! విరాగులం గలఁతువయ్య! తలంపఁ గడిందిజోదవీ
వయ్య! మదీప్సితంబు వినుమయ్య! ధరావరు నన్నుఁ గూర్పవే
మయ్య! దయాపయోధివగుమయ్య! నుతింతుఁ దలంతు రతీపతీ!. 178

ఉ. తుంటఁట కార్ముకంబు కరదొట్టిన తేంట్లఁట వింటినారి చే
యంటినవాడుతూపులఁట యవ్వలపాలఁట కేతనంబువా
గంటిపలుంగు గుఱ్ఱమఁట కాయము లేదఁట నీకు లోకముల్
కొంటెతనంబునం గెలిచికోలిది యచ్చెరియంబు మన్మథా. 179

సీ. నీయుగ్యమనికదా నెమ్మిరాచిలుకను, బంజరమ్మునఁ బెట్టి పలుకుచుందు
నీతూపులనికదా నెత్తమ్మిఱేకుల, గాఁపమ్మునఁ గండ్లఁ గప్పికొందు
నీమామయనికదా నీరజారినిఁ జూచి, యాననంబునఁ గూర్మి నలముకొందు
నీసుహృత్తనికదా నిసువుదెమ్మెరనిట్లు, నాప్రాణపదముగా నమ్మికొందు
గీ. నీదుపరివారమనికదా నీలకంఠ, మునకు నటనంబుఁ గలహంసమునకు గమన
మలికి శ్రుతికోయిలకు గానమలవరింతుఁ, గోరికలనిమ్ము మనవిఁ గైకొమ్ము మదన. 180

శా. ఏణీమాణవకాక్షియాసరణి నుత్ప్రేక్షోక్తులం గేళినీ
ప్రాణేశున్ వినుతించి పూజనల నారాధించి యాచెంతఁ బూ
బోణుల్ వేడుకనూడిగంబుసలుపం బూవింటిజేజేకు వే
బ్రాణాచారము వడ్డలీలవిరిశయ్యం జేరి మై వ్రాల్చడన్. 181

వ. అత్తగతంబున. 182

ఉ. మక్కువనుక్కువం బెడలి మాటికిమాటికి రాజరాజుత
న్నక్కువతక్కువల్ దలఁప కింతయుఁ వేఁడినమానసంబునం
దక్కటికంబు దోఁపమికిహాయని పాయనిచింత నెంతయున్
జిక్కి విరాళిఁ గ్రుక్కి మనుఁ జెక్కటఁ జేఁ గదియించి విన్నయై. 183

ఉ. ఏటికివచ్చెభూమివిభుఁడీవనవాటికి? వచ్చెఁగాక నే
నేటికిఁ బూలబంతినటు వేసితి? వేసిన నేమియాఘనుం
డేటికి నన్నుఁదావలచియింతలు ప్రార్థన చేసెఁ? జేసె నే
నేటికివాని లోఁ గొనక నెల్లిదమైతిని మారుబారికిన్?. 184

క. అనుచున్ నలుగెలఁకులుఁగనుఁ, గొనుచున్ వనుఁదానవిసివిసికొనుచున్ మీఁద
ట్లనుచున్ సారెకునసురసు, రనుచున్ జెలులపహసింతురని వెఱఁగొనుచున్. 185

వ. ఇట్లు నెలంతి బలవంతంబగువలవంతం బొరలునవసరంబున. 186

చ. పులుఁగులుగూండ్లఁదూఱ విరిబోఁణులయల్కలుదీఱభానవో
పలములకాఁకలాఱరవిపశ్చిమశైలముఁజేర దిక్కులన్
దలమగునాఁకదేఱరతినాయకుఁడమ్ములనూఱెఁ దమ్ముల
గ్గలముగవాడఁబాఱవిరికల్వలతేనియలూర నత్తఱిన్. 187

చ. కరమనురక్తుఁడై పరుషకాంతివహింపక భర్తచల్లనా
కరముల బుజ్జగింప వినఁగానక పద్మిని మోమువాంచెనా
కరమనురక్తుఁడై పరుషకాంతి వహింపక భర్తచల్లనా
కరముల బుజ్జగింప వినఁగానక పద్మిని మోమువాంచునే!. 188

సీ. ఖరకాలకరవాలఖండితవాసర, కాసరస్కంధచక్రంబనంగ
సముదగ్రచరమదిశాంబరాధరశిఖా, పరిపక్వదాడిమీఫలమనంగఁ
బశ్చిమాశావధూపటుతరస్తనతట, స్ఫారకాశ్మీరలేపంబనంగ
సాయంసమారబ్ధజలధిసంధుక్షిత, ఘనదీప్తబడబాముఖంబనంగ
గీ. విరహిజనజైత్రయాత్రానుసరదనంగ, కేతనస్ఫీతమకరదృగ్దీప్తులనఁగ
నొపలనెఱసంజకెంజాయలోలయనపర, భాగముఁ జేర పద్మినీబాంధవుండు. 189

మ. బలభిన్నీలశిలాకదంబములతో భద్రేభయూథంబుతో
జలదశ్రేణులతో మిళిందములతో జైవాతృకాంకంబుతో
లలనాసంయుతకేశపాశములతో లక్ష్మీధరాంగంబుతో
వలదిందీవరపాళితోఁ జెలిమి వర్వన్ బర్వెఁ గ్రొంజీఁకటుల్. 190

సీ. గగనగంగాతరంగములతోఁ గుస మింటఁ, దెమలుడిండీరఖండములమాడ్కి
వియదలక్తాపింఛవిటపచ్ఛటానట, జ్జ్యోతిరింగణగణద్యుతులభాతి
శివతాండవక్షణోత్క్షిప్తాజినమునందు, నిలకొన్న నిఱుతవన్నియలపగిది
రాజమార్గమునఁది గ్రామశిరోమణుల్, చల్లునాచారలాజలవిధమున
గీ. యామినీకిసోమునకు వివాహమునఁదనరు, చలువపందిటిముత్యాలసరులసరణి
విష్ణుపాదముఁ గైసేయువిరులపోల్కి, కలిమి వాటించె మెలకచుక్కల బెడంగు. 191

ఉ. ఘోరతరాచ్ఛభల్లవనకుంజరపేచకచిత్రకాయమా
ర్జారవిహారవేళలనుశంకదలంకకజారచోరులి
చ్ఛానుచిరప్రవర్తనలుసల్పఁ దొడంగిరి జాంగలంబులం
దారయ వేమఱుం గనక మర్కట ప్రాణముకంటె తియ్యమా. 192

వ. ఆసమయంబున. 193

చ. స్ఫురితనవోత్పలద్యుతులు చొప్పడయామినికామినీభవ
స్మరహరమూర్తియై తమముమూర్ఛిల వెన్నెలపుల్గువేలుపుం
దొరలకొసంగఁబూనినవినూత్నసుధాకలశంబుచాడ్పునన్
సరసకళావిలాసరససాంద్రుఁడు చంద్రుఁడు దోఁచెఁ దూర్పునన్. 194

చ. కుముదినిపొంగెఁ బద్మినులగోము దొలంగె నభస్స్థలింజకో
రములు చెలంగెఁ గోకనికరమ్ము గలంగె విధుండు పూర్వభా
గమున వెలింగె నంబురుహకాంతుఁడు కాంతి దొఱంగె నౌర! లో
కము తనమేలుగాఁ దలఁచుఁగా సరివారిపరాభవంబిలన్. 195

సీ. అంగభూనవమల్లికాస్త్రప్రసారంబొ?, విరహిణీజనతనూవిలసనంబొ?
కమలినీకమలసత్కుముదినీహాసంబొ?, పక్వజీవంజీవపాయసంబొ?
స్రవదిందుమణిగణసారణీసారంబొ?, క్షణదాభిసారికాస్తనపటంబొ?
జారిణీకరణోత్సవనూనవర్షంబొ?, వియదుత్కలశాబ్ధివికసనంబొ?
గీ. యనఁగ బ్రహ్మాండమండపాభ్యంతరమునఁ, బాలగారయొనర్చినలీల మెఱసి
పుడమిపిండారఁబోసినపాలువు మిగిలి, పండువెన్నెల నిండె దిఙ్మండలమున. 196

క. ఈకరణివిధునికరములు, శ్రీకంఠాసుతునిచివురుచీకరలగతిన్
దాఁకగఁ జేతులనొడ్డుచు, నాకొమిరెమిటారికలికియలుకవొలంకన్. 197

ఉ. హాకరుణావిహీన! నలినాహిత! చింతిలుచున్న దాన నీ
వీకడఁ జేరినన్ను నలయించెదు నీదుకులంబునీఅగుం
గాకగుణంబు మందమగుఁగాక నురమ్ము మలీమసంబగుం
గాకభవచ్ఛరీరముఖండములై చెడుఁగాక దుర్మతీ!. 198

ఉ. మందరమెత్తిదైత్యులసమర్త్యులనొక్కటిచేసి వాసుకిన్
బందముత్రాడొనర్చి హరి పాలసముద్రముఁ జిల్కుటల్ మరు
ద్బృందముఁ బ్రోవ నా భువనభీకర నిన్ను సృజించి పాంథులన్
ద్రుంచగఁ జేయఁగా కహహ నల్లనివారల నమ్మవచ్చునే. 199

ఉ. తమ్ములనేఁచెనో ? నిఱుసుదాల్చెనో ? గౌరవహానికొగ్గనో ?
యమ్మకచెల్ల హాలహాలముల్లున దానిఁవణంచి యుత్తమాం

గమ్మునవిన్న శేఖరముగాఁ గొనియెన్ గుహనాశిరాశికుం
డిమ్మహిలోపలన్ విషమదృష్టి యెఱుంగు నె తారతమ్యముల్ ?. 200

క. నగుమొగమునకోడిన యా, మృగదీఁగ్రరుకుముదబాంధవునిట్లా
నగకుచ నగియాతనికై, మిగులన్ మొరచూపు నతని మేనల్లనితోన్. 201

సీ. ఘనజటాజూటంబుకై వడి వెన్నున, రాజిల్లు వేణీభరంబుఁ జూచి
హాలాహలశ్యామలాభమైన గళముఁ, బూసిన కస్తూరిపూఁతఁ జూచి
భసితానులేపంబు పగిది నెమ్మేనిపైఁ, గనుపట్టు నంగరాగంబుఁ జూచి
శశికలాభరణంబు సరణి నొసలిమీఁద, పైకమాగొజ్జంగి తేకుఁ జూచి

గీ. చిఱుతవన్నెలపయ్యెద చెఱఁగుఁ జూచి, రాజితంబైన పూఁబొన్నరమణఁ జూచి
పురహరుని మూర్తి యని యల్కఁబూని తేమొ, యలరువిలుతుఁడ నీశకుంతలను జూచ్చు.

ఉ. నిండినపండు వెన్నెలలు నెక్కొనుకన్నులనీరు నున్న పే
రెండకు వానకోర్చి కృశవృత్తిఁ దపస్వినులై నమాపయిం
గాండములేయఁబూని దవు గర్వము చేనటుగాన నీదుకో
దండము ఖండమై పకురథంబు మయూపఱుఁ గాకదర్పకా. 203

ఉ. నీమధుసేవ నీపథికనిష్ఠురవృత్తి నీయనంగతన్
వేమఱుఁ జూడలేక గద నీ జనకుండటు కన్నుమూసెనీ
మామకృశింపెనిక్ గని నమాత సుఁజం చలభావమందెని
స్సీమకరాంక యిట్టి మ్మృతిజీవన మేటికి నన్ను నేఁచనే. 204

క. వారనియారసమున వే, మారు మారున్ రమాకుమారున్ మారున్
దూరిమిటారియతనికిన్, దేర్చి గారించు కమ్మతెమ్మెరతోడన్. 20₅

ఉ. చందనశైలరాజమునఁ జారుపటీరనికుంజమంజరీ
బృందము విందు సేయు విహరింపక క్రొవ్వికపాలిశాలికా
శిందముఁ జూడ వేగదవో తెమ్ముసమీరకిశోర దీనమే
లందెదు మత్తమావిలవితాహిసహ ప్రముఖాగ్రయాయివై. 206

చ. వలపుల కొండ డిగ్గి కుజవారములో నటులుత్తరంబుగా
వెలువడి వేగ నేగ వెడవిల్తుని కార్యము గాఁగ వచ్చెదోఁ
జెలువలకో అలంజిదిమి చేరువవఁబులఁ గంటి వంతదు
మ్ములిపోదక బైనీ కువముకున్ విత గాఁగ దామ దానిలా. 207

క. మకరాంకువకు న్యాసుకన్, ప్రకటఘటార్భటులు పేర్చి పైకొను మధులి
ట్పికపిక కాదంబమయూ, రకములకున్ వెఱచి వెఱచిరమణీయులకతోన్. 208

సీ. ఫలభంగములు సేయు పనిఁబూని దరుగదా, కలుకులా యివిమీకుఁ జిలుకలార
బలుశిఖండికనంబుఁ బాయఁ జాలరుగదా, యొకింపులా యివిమీకు నెమ్మలార

కంటకోన్ముఖములై కడు మ్రోసెదరుగదా, యాటలాయెవిమీకు తేంట్లులార
పక్షపాతముమీఱఁ బరువెత్తెదరుగదా, మించులాయెవిమీకు నంచలార
గీ. యింక నెన్నఁడుమాతోడహితముఁబూని, ముచ్చటాడరో యాడరో మోమునందుఁ
బొలయరో వెంబడింపరో బోయెమరునిఁ, గూడినంత నెయిట్లు పోరాడఁదగునె. 209

వ. అని యివ్విధంబున నిందుకందర్పమందానిలమిళిందశుకపికచక్రాంగమయూరవారంబు
లం దూఱుచు నంతకంతకు నగ్గలంబైన బెగ్గలంబున మఱియు నిట్లు వితర్కించుచు. 210

ఉ. వారక పైపయింబొరలివచ్చుమహావిరహాంబురాశినే
నేరపిఁ నీఁదుదానఁదుది నెన్నఁడు క్రూరుఁడుమారుఁడేనియుం
ఘోరముమీఱ నేయఁదొడఁకపెట్టున నెట్టినఁబోవనట్టియా
పీడఁడిజీవమేటికని వేమరు వేమరుశేచుచుండఁగన్. 211

వ. వెండియు. 212

శా. నీరేజాక్షినిదూఱిదూఱియునిలున్నిందించినిందించిప
ల్మారుఞ్మారునిఁగేరికేరివిరహమ్లాయత్తనూయష్టియై
యారాజాననయేడ్చెవెక్కుచుమృగంతాశ్రుచ్ఛటల్ చెక్కులఞ్
జాంగోకిలకాకలీస్వరసుధాసారంబసారంబుగాన్. 213

వ. తదనంతరంబ. 214

తే. ఆకలికికంఠకాకలినాకలించి, చేరఁజనియారజనినిట్లుమారజనిత
తాపమున వేపమానాంగియైపాలంతి, వెచ్చనూర్పుఁగనెచ్చెలుల్ పిచ్చలించి. 215

ఉ. అమ్మకచెల్ల! యేటివెతలమ్మ! కనుంగవనీరునించెదే
లమ్మ! విరాళిజాలిగొనకమ్మ! ప్రియంబునమాటలాడవే
మమ్మ! లతాంగికిట్లువగదమ్మ! సఖుల్ వినరానిగోప్యమే
మమ్మ! మనోగతమ్ముచెపుమమ్మ! ఘటింతుముబాలికామణీ! 216

క. రావింతుమునీజనవుని, సేవింతుమునీదుకోర్కిచేకూర్పుటకై
కావింతుమునీయిష్టము, భావింతుమిమీఁదితెఱఁగుపలుకుమితల్లీ!. 217

వ. అని యనేకప్రకారంబుల నెచ్చెలులు విచ్చలవిడి ననునయించి పసిండిగిన్నెలంబోని
మిఱుంగుఁజన్నుల మున్నీరై తొరంగుకన్నీరుకనికరమ్ముల నరుణనాళీకనికరమ్ములకర
ణిం బ్రభాకరంబు లగుకరంబులనద్దుమఁ దిలకంబుదిద్దుమ విమలంబని ముఖకమలంబునం
గపులునూపుచుం దెమలుశ్రమజలలవంబులం బల్లవంబులఞ్ విసరుచు మాటికిం గొస
రుచుఁజిబుకంబు నివురుచు వేనలిం దివురుచు నక్కునంజేర్చుచు మక్కువ నూరార్చు
నవసరంబున. 218

తే. జిలిబిలివిటగారికొండొకసేపదేరి, ప్రాణసఖులారా! నానుడుల్ పరఁగవినుఁడు
లోనవడఁచినగుట్టునాలోనమట్టు, పఱుపరామికినింకదాఁపఱికమేల! 219

ఉ. మొల్లపుమొల్లపూఁ బొదలమొగ్గలనగ్గల మైనతీవలం
దల్లనఁజల్లనై యెలయునందపుఁ గందపుఁగొండ గాడ్పుచే
నల్లికబిల్లికందవరునాఖిడిమామిడిక్రీడభూమిభృ
త్తల్లజుఁడల్లజాలరివిధంబునఁ బొంచిహరించెడెందమున్. 220

ఉ. నాయనురక్తిచెప్పవలెనా యని యార్యులచాటుదానఁగా
నాయని రవ్వకోర్వఁగలనాయని రాజులపొందఁగోరనా
నాయని తత్తఱంబుదగునాయనియింతలు సేయుదాననే
నాయని సంభ్రమింపఁగనునాయని సైరణసేసితిన్ ధృతిన్. 221

ఉ. అవ్వనుదాతనుం గఱకులాడఁగ నేటికి ? దాదులై నమి
మ్మెవ్విధిమించనాడనగు హేయవివర్జితుఁ దాతకశ్యపుఁ
బ్రువ్వఁగఁదూఱఁగాఁదగదు పుట్టినవాఁడెనయావిహీనులై
దవ్వులఁద్రోచిచన్నతలిదండ్రుల దూఱెదసారెసారకున్. 222

ఉ. పిన్నటనాటనుండియును బెక్కుడుముల్ పడుచున్నదాన నా
బన్నముఁజెప్పనేలయిది ప్రాక్తనజన్మకృతంబు దీనికిన్
వెన్నియ వెట్టినట్టుజనవల్లభుఁడిక్కట! యెంతవేఁడినన్
గన్నడచేసితప్పులముఁగాఁ గొనఁగంటినివేయు నేటికిన్. 223

ఆ. ఆమనోహరాంగుఁ డనురాగభరితుఁడై, వేవిధములనన్ను వేఁడుకొనియె
నెంతవేఁడుకొనిన నెక్కుసక్కెములాడి, విన్నఁ జేలనైతివెలఁదులార! 224

ఉ. నావెతఁజెప్పనేల ? నరనాథునిమేనుశిరీషకోమలం
బావలగాఁజుటూ పులకునీవిరితావిదిండికాఁకకున్
దావలమయ్యెనేరహీనిదాళిన యయ్యయో ! యెంతవేఁడినన్
నేవినఁజేరనైతివినీతికిలోనయితిన్ ధరిత్రియంబుగన్. 225

తే. అధిపుసేమము నాసేమమాకలించి, నేఁడుకవఁ బూర్చియిరువురనిర్వహించి
కనికరముపూనుపరమోపకారులెవ్వ, రితనికమ్మొక్కునైతునేనేమిసేతు. 226

సీ. తరుణప్రసూనకేసరముర్మురంబుపై, న్వనబిసాళించిపైఁ బొరలుదానఁ
బ్రోదిమైనిండారుపూఁ దేనెకోఁకునఁ, దుస్సాహసముచేసిదుముకుదానఁ
బరువంపుఁజిగురాకుబాఁకుఁ జేకొనిలేచి, పొమ్మురంచునురమ్ముగ్రుమ్ముదాన
మొయికొన్నవలపుఁదెమ్మెర కాఁచుచిచ్చులో, నాపన్నినముదీఱనపడుదాన

గీ. నీమమునిబాణములరాక నీసుధాంశు
కళలబలుకాఁక నీచరుక్కుంజకంపు
జోక నీకోకిలంబులపోక ఛోర్చి
గోల ! వేయేలనిఁకతాళఁజాలనమ్మ! 227

సీ. నామ్రోల నిరతంబు నటనంబు గావించు, నెమిలి యెవ్వరి మ్రోల నిలుచునొక్కొ?
నా వెంటఁ బెనుదంటయై విహార మొనర్చు, కలహంసి యే లీలఁ గడచునొక్కొ?
నా హస్తమున వ్రాలి నలువొప్పఁగాఁ బల్కు, చిల్క యెవ్వరి చేతఁ జేరునొక్కొ?
నా చేతి మేఁత చేనా నాఁటఁ బెనుపొందు, నీలేఁడికొదమ ప్రోపెవరిదొక్కొ!
గీ. యనుచు రాజర్షికన్యక పనవి పనవి, యలసి సొలసి ప్రియంవద యంకపాలి
హాలి వ్రాలిన దశదిశల మెసఖుల, గములహాహారవమ్ముల కలకలమ్ము. 228
వ. ఇట్లు మూర్ఛిల్లినఁ బ్రియంవదాప్రముఖ సఖీవిసరమ్ము నలుగెలంకుల నక్కన్యకామణిం బొదివికొని. 229

మ. కనుదమ్మిన్ హిమవారిపూరము నుపంగా దంచుఁ దావ్యజ్ఞన
స్తనకోకమ్ములఁ జంద్రకాంతమణులుంచం దాళి లేదం చుమై
ననకూనంబలు మారువీజనములూనన్ రాదటంచున్ సఖీ
జనముల్ దేర్చిరి మెల్ల మెల్లనఁ జెలిన్ సౌమ్యోపచారంబులన్. 230
వ. తదవసరంబునం బ్రియంవద దరహాసభాసురముఖి యగుచు ననసూయతో మెల్లన నిట్లనియె. 231
సీ. పుట్టినప్పుడె గాధపట్టి గాదిలిపట్టిఁ, జూచి పల్కినమాట సూనృతంబు
మాలినీతటసీమ గోలఁ గాంచి వచించు, నూర్ధ్వరేతుని వాక్య ముత్తమంబు
ప్రోదికై మునలఁ బంపుమఁ జేయు నదితికశ్యపుల సంవాదంబు సమ్మతంబు
తరుణి చిన్నెలు చూచి దైవజ్ఞులగు ఘనుల్, నిర్ణయించిన మాట నిక్కువంబు
గీ. నిఖిలరాజాధిరాజమాణిక్యమకట, తటఘటితపాదపద్ముఁడై ధరణి నాల్గు
చెఱఁగులేలెడు దుష్యంతుఁ జెట్టపట్టి, భూరిసౌఖ్యము లందు నీవు పువ్వుఁబోణి. 232
వ. ఇట్లగుటం గాలయాపనంబునకు సమయంబు గాదు. నేవచ్చ నంతకు నిక్కన్యారత్నంబు నతిప్రయత్నంబున సురక్షితంబు గావించునది యని యనసూయాదులకు నొప్పం జెప్పి నరేంద్రస్కంధావారంబుఁ బ్రవేశించె ననినవిని జనమేజయుండు తరువాతిచరితంబు వినవలతు ననుటయు. 233

ఆశ్వాసాంతము.

క. శ్రీసురపూజాస్పదపద, భాసురవాసరకరోదయసితాలసిత
క్ష్మాసురరక్షావిత్సుహృ, త్తాసురచంక్రమణ! వేంకటాచలరమణా! 234
మాలిని. విమలకమలనేత్రా! విక్రమాక్రాంతమిత్రా!
ప్రమదకరచరిత్రా! ప్రస్ఫురత్పత్రిపత్రా!
కుమతితృణలవిత్రా! కోమలశ్యామగాత్రా!
యమితగుణపవిత్రా! యబ్ధికన్యాకళత్రా. 235

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందన ప్రసాదసమాసాదితకవితావిచిత్ర మైత్రేయసగోత్ర నృసింహగురుపుత్త్రకృష్ణకవిప్రణీతం బైనశకుంకలాపరిణయం బనుమహాప్రబంధంబునందు దుష్యంతుండు కణ్వాశ్రమంబుఁ బ్రవేశించుటయు శకుంతలాసంవాదంబును బ్రియంవదవలననమహీకాంతుండు శకుంతలాజన్మప్రకారంబు వినుటయు సేనానివేశంబును బలికిడయుం జంద్రమన్మథాద్యుపాలంభంబును శకుంతలావిరహవేదనాభరంబు సైరింపంజాలక ప్రియంవద నరేంద్రస్కంధావారంబుఁ బ్రవేశించుటయును నను విశేషంబులు గలిగిన ద్వితీయాశ్వాసము.






# తృతీయాశ్వాసము.



శ్రీ రమ్యవైజయంతీ
తోరణవిభ్రాజమానదోర్మధ్యగృహా
ధారశ్రీసంసేవ్యా !
గీరమణస్తవ్య! శేషగిరినాస్తవ్యా ! 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు ప్రియంవదనరేంద్రస్కంధా
వారంబుఁ దఱిసి తిరస్కరిణీప్రభావంబున నంతర్ధానగతయై మెల్లనరాజమందిరంబు
సొత్తెంచి కలయఁగనుంగొను నవసరంబున. 2

శా. ఆరాజన్యుఁడనన్యగోచరతమనోజార్తిజ్వాలన్మూర్తియై
యారాజర్షిసుతాధరాధరసుధాహారంబుపైఁ గూరిమిన్
సాలస్ఫారచతుర్విధాన్నఫలమజ్జాపాయసాపూపస
ల్లూరాద్యుత్తమభుక్తిమానసమునన్ లోభింపఁడింతేనియున్. 3

వ. ఇట్లు శకుంతలావిరహానలసంతప్యమానమానసుండై యమ్మానవేశ్వరుండు. 4

సీ. ఉదయదిందుప్రభాభ్యుదయసంపదలకుఁ, దిలమూపనోపక తలఁగి తలఁగి
కలకంఠకులకంఠకాకలీకలనంబు, కర్ణగోచరమైనఁ గలఁగి కలఁగి
మరుఁడేయు గేదంగివిరికటారపువ్రేటు, వాదికగ్గలంబైనఁ గలఁగి కలఁగి
చందనాచలమరుత్కంపితంబులవారి, దురవగాహంబైనఁ దొలఁగి తొలఁగి
తే. తేపమీఱఁగఁ దల్పంబు డిగ్గిడిగ్గి, తేపతేపకునిట్టట్టుఁ దివిరితివిరి
పొలఁతి చెలువంబుమాటికిఁ బొగడిపొగడి, వసుధవ్రాయుచు మోము వాంచివాంచి. 5

ఉ. హా! యను మానిరాజతనయా! యనుహోయనిపల్కు వేమిరా
రీ! యనురమ్ముసమ్ముదకీ! యనుఁ గన్నెకనేయకోలతాం
గీ! యనుఁ దాళఁజాలఁ గటకీ! యను ముద్దియనిమ్ముకేరవా
ణీ! యనుజాలమేలతిరుణీ! యను రాజువిరాలిజాలిచేన్. 6

వ. ఇట్లు మునికన్యకాధ్యానపరాధీనుండై యున్మత్తప్రలాపంబులఁ బొరలుచున్నరవరుం జేరంజని. 7

సీ. తివుటఁ దియ్యనితేనె దివురువాతెఱగంద, నుసురసురని వెచ్చనూర్చువానిఁ
జెక్కుటద్దములపైఁ జెందిజీరలువాఱ, నిభృతుఁడై కన్నీరునించువాని
గోరంతసడిఁ గన్నగుండె జల్లురనంగ, సొలసిదిక్కులుదేఱిచూచువాని
మేనఁబుప్పొడియొత్తఁగా నొయ్యనొయ్యన, విరులపానుఁపుమీఁదఁ బొరలువాని
గీ. మదవతీ! మత్తకాశినీ! మంజుభాషి, ణీ! మనోహారిణీ! మానినీ! మరాళ
గామినీ! యెంతవేఁడినఁ గనికరమ్ముఁ, బూనకేఁచెదవని మూర్తిఁ బొరలువాని. 8

ఉ. కాంచిచతుస్సముద్రపరిఖావృతభూవలయాధినాథుఁడ
క్కాంచనగాత్రికన్నుఁ దమకమ్మునఁ జింతిలుచున్నవాఁడుభా
వించఁగఁ దుంటవింటిదొరపేరలయిర్వురపొందుఁ గూర్పనూ
హించెబళీ! యటంచుఁ బృథివీశునకుం బొడసూపెనమ్రయై. 9

వ. ఇవ్విధంబున. 10

క. జయజయశబ్దంబులతో, భయవినయముల మ్రోలనిలుచుపద్మదళాక్షిన్
బ్రియమునఁగనుఁగొని యిట్లను, నయనయదయమానమానసౌఖ్యుండగుచున్. 11

మానిని. సేమమె తామరసోదరసోదరచిత్రవిభాననశాలినికిన్ ?
సేమమె ఫాలచలాలకజాలకశీర్యదవార్యమహాలినికిన్ ?
సేమమె ఫుల్లసువర్ణసువర్ణవిజిత్వరదీధితిమాలినికిన్ ?
సేమమె భావజభావజరాపహశీలవిడంబితకేలినికిన్ ? 12

ఆ. అనుచుఁ జెక్కుమారులత్యాదరంబునఁ, గన్నె సేమమరయుచున్నఁ జూచి
సన్నవాలుగనుమసకియప్రియంవద, పార్థివేంద్రుఁ జూచి పలికెనిట్లు. 13

ఆ. తడవులేదుచూచి ధరణీశ! యింతలో, సేమమరయుటెల్ల చిత్రమయ్యె
నతనుమంత్రసిద్ధు లగుమహాపురుషుల, కగ్గసేయసేమ మెట్లుగలుగు ? 14

ఉ. భావజరూప! నిన్నలరుబంతినగల్చినయంతనుండియున్
దావలమైనభూరిపరితాపమునన్ మునికన్య ఖిన్నయై
పూవులదండలున్ వలచుపూఁతలుసొమ్ములుభక్ష్యభోజ్యముల్
కావలెనంచుఁగైకొనకగాసిలుచున్నదిసూనశయ్యపై. 15

ఉ. ఆదినిబుబ్బబోణికసమంతిరుదంతముగ్రాఁచెనగ్గమై
యాదటనవ్వసంతకుసుమాకరముం బ్రతికూలమయ్యెఁ జం
ద్రోదయమంతకుంగడఁచుచున్నది రాజన్మృగాంక సేవచేఁ
బైదలి మేనుసౌఖ్యమునఁ బాటిలునో యనిమిమ్ము వేఁడెదన్. 16

క. ముదుసళులవ్వయుఁదాతయు, హాదనువజనకుండుతీర్థయాత్రకు వెడలెన్

మదిరాస్యయొడలిబడలిక, యిదమిత్థమటంచుఁ దెలియ దెట్లొకొ మాఁదన్. 17

సీ. బింబోష్ఠిరాజకీరంబునొయ్యనఁ జూచి, వగురులాడఁగ నోడికొదుకుచుండు
నంభోజముఖిరాజహంసంబు వెనుకొన, వెలవెల్లఁబాఱుచు వెన్కఁ ద్రొక్కు
జలధరవేణిరాజమయూరమెదురెక్కఁ, బరిపరివిధముల బ్రమసిపాఱు
రమణనుత్పలగంధి రాజబింబముఁ జూచి, యాదర్శనంబోలమాసగొనును

తే. రాజపదముద్రితపదార్థరాజియెడల, భయముగొని యున్న యదిమిమ్ముఁ బరిభవించి
కాన నీయాన యనృతమ్ముగాదుసుమ్ము, రమ్మ భయమిమ్ముకొమ్మకు రాజమాళి! 18

వ. అనుచు మఱియుం గుపఱిచి తన్నుం దోడ్కొని చనఁ నుద్యోగించు ప్రియంవదవై యాత్యంబునకు మనంబున మెచ్చుచుఁ గామితార్థంబు సమకూడుటం బొడముకుతుకంబు మొగంబునందోఁపనీక వుయిలోటదక్కి రాజకంఠీరవుం డక్కలకంఠితో నిట్లనియె.

తే. ఏటువడి గ్రుక్కుమిక్కవకిట్టులొంటి, నేసితా గాసినొందుట కేమికతము!
యగునగును మేలుమేలుఁగయాళికలికి, కలికితనుగంటి తెరగంటికలువకంటి! 20

తే. బాలసఖ్యం బకారణప్రహసనంబు, స్త్రీవివాద మసజ్జనసేవ చనవు
లేనిమురిపంబు రాగంబులేనిపొందు, కానిపనులం ద్రుబుధులు నిక్కంబునూవె. 21

ద్రుతవిలంబితవృత్తము. అలవసిష్ఠమహాముని నెమ్మెయిన్, గెలఁచు గాధిజుకాముని బాధలన్
మెలఁచివూడిన మేనకపట్టియై, చెలఁగులేమకుఁ జేష్టలు వింతలే. 22

క. సామోపక్షేపంబుగ, భూమీశ్వరతిలకుఁ డిట్లు పొరిఁబొరిఁ బలుకన్
దామరసావనయానవ, తామరసము ప్రేమరసముదలకొనఁ బలికెన్. 23

ఆ. బాలముద్దరాలు పసిగాపుగసుగందు, కూనముద్దుగుమ్మ గోలయబల
యీయతాఱలాడ నెట్లునోరా డెనో, రామరామ! నిరపరాధసుమ్ము. 24

ఉ. ఆగమసమ్మతంబనుచు నాద్యులు పల్కుదు రార్యులై నయ
భ్యాగతులెద్ది నేఁడీనఁ దదర్థము సిద్ధిలఁ జేయుటల్ మహా
భాగుఁడవీవు నీదయిన ప్రార్థితముల్ సమకూరుని త్తటిన్
రాగముతోడ నచ్చటికి రమ్ము సపర్యలు గొమ్ము కొమ్మ చేన్. 25

వ. ఇంకం గుతర్కకర్కశవాదంబులం బనిగొనదేమును బహువిధంబు లనుపచారంబు లాచరించితి మెద్ది యునమ్ముద్దియ యతనుతాపంబునకుం బ్రతీపంబు గావయ్యెనట్లగుట నతనుతాపంబనితోఁచుచున్న యది యది యును యనంతరన్యాయంబున భవద్దర్శనానంతర సంజాతంబగుట నవ్వెడఁగునకుం బునర్దర్శనం బొసంగి కనువేదుఱుదీర్చి యీయారార్చునది దీననీసను నాచంద్రార్కంబుగాఁ గీర్తిపౌరుషంబులు నిలకొను నట్లగుట మద్వచనప్రకారంబున శీఘ్రంబ యక్కన్య సన్నిధానంబునకు రావలయునని సవ్యాజంబుగా సూచించిన నొడంబడి ప్రక్చందనచీనాంబరాభరణంబుల నలంకృతుండై గూఢప్రకారంబున నిజస్కంధావారంబు వెలువడి. 26

సీ. ముఖపూర్ణశశియోగమునమించునవిలీలఁ, దగురత్నమకుటమాదలఁదలిర్ప
హస్తాబ్జముల వ్రాలునళులనానీలంపు, టుంగరంబులు వ్రేళ్లనొఱపునెఱప
గాత్రకాంచనయష్టిఘనదీప్తిరింఛోళి, చెలువునఁబచ్చనిచేలఁజీరఁ
జివురులగెలుచుఁదాల్చినకెంపుజోడుల, కరణినంఘ్రులమోచికలుగహింపఁ
తే. గంగకలితసరస్వతిఁగౌఁగిలించు, నమరనదిభాతినురమునహారమడర
నంగభవమంగళాకృతినాశ్రమంబు, ఠీవిమైఁజేరదుష్యంతభూవిభుండు. 27

వ. ఇవ్విధంబున నాశ్రమంబుఁ బ్రవేశించి చనునవసరంబున. 28

సీ. పోఁగూడదీదారిఫుల్లహల్లకసార, కాసారసీసారకర్దమంబు
చనఁగూడదీదారిసన్నాగళన్నాగ, పున్నాగభిన్నాగసన్నుతంబు
దూరఁగాడదీదారినరసంకుమదపంక, పంకిలైణాంకోపలాంకితంబు
గమిఁగూడదీదారిసుమగుంజదలిపుంజ, పంజరీకృతమంజువంజులంబు
తే. నాథ! యిదికప్పురంపుటనంటికోన, మహిప! యిదిగో స్తనీకాయమానసరణి
నృపకులాగ్రణి! యిదిమాలినీప్రవాహ, మధిప! యదె మాడుము శకుంతలావసథము. 29

వ. ఇవ్విధంబున సూచింపఁ బ్రియంవదావదనారవిందకందళదమందమకరందబిందుసందోహంబులఁ దుందిలహృదయహిందోళుండై యారాజపురందరుండు ముహుర్ముహురుల్లలన్మాలినీకల్లోలఘుమఘుమారావంబు మార్దంగికవిమర్దనపరిణర్దన్మర్దళనినదంబుగా, మధురమధురసప్రలుబ్ధముగ్ధమధుకరనికరఝంకారంబు శ్రుతిప్రకారంబుగాఁ గోకిలకలస్వనవితానంబు గానంబుగాఁ, జిత్రం బగువాదిత్రంబునకుం బాత్రంబులయి మాద్యన్మయూరకళత్రంబులు నర్తనంబుం బ్రవర్తింప, నిలింపకుటవిటపాంతరనిర్యత్సుధాసుధాకరకలాపంబు కరదీపికారూపంబయి నలుగెలంకులం గడలుకొను సంధ్యాతిమిరంబుల నెడగలుగం జడియుమ మలయానిలచలనవిలులితలవలీలవంగలుంగాదివివిధకుసుమకేసరపరాగపటలంబు మంగళాచారసముత్సారితపిష్టాతకంబుగాఁ, గూజద్భృకనికరకాకలీకలకలంబు పుణ్యాహఘోషంబుగా, మహోత్సవంబున శకుంతలాభవనంబుఁ బ్రవేశించునవసరంబునం బ్రియంవదాప్రేరితలై తత్పరిచారికాజనంబులు నీరాజనంబాచరించి, సప్రణయంబుగా నభ్యంతరంబునకుఁ దోడ్తెర నుచితపీఠంబునఁ గూర్చున్నయన్నరనాథు నర్ఘ్యపాద్యాదివిధులం బూజించి, సఖీజనమధ్యంబున లజ్జావినమ్రమౌళి యై యున్నయక్కన్యామణిం జూచి దుష్యంతమహీకాంతునితోఁ బ్రియంవద యిట్లనియె. 30

సీ. పనులసందడినైనఁ బరులవీనులుసోఁకఁ, జేరలుంగిడలేనిభీరుమధ్య
ప్రహసనంబుననైన బాహిరంబగునట్లు, పకపకనవ్వనిపద్మగంధి
యాసాయమభ్యాగతార్చనంబుననైన, నలసితివనిపువ్వారుఁబోఁడి
సతతంబుతినప్రాణసఖులతోనైనను, భావంబుబయలుకొల్పనిలతాంగి

తే. యూర్ధ్వరేతుని పెనుపున నొజగలిగి, యుభయకులములను గనకీర్తి నల్లసిల్లఁ
జేయఁగలసాధ్వి యీలేమచిత్తవృత్తిఁ, దెలిసి పాలించుకొనుము ధాత్రీకళత్ర! 31

వ. అని చెలువవ్వ దళుకొత్త గూఢప్రకారంబుగా రాజునకు శకున్య నొప్పఁ జెప్పి తక్కటి యనసూయాదులఁ గనుసన్నలం గలిపికొని. 32

సీ. అదితికశ్యపులిప్పు డలివేణి మైకప్పు, వినిచూడఁ దగునంచు వెడలెనొకర్తు
మొన్న నాటితి మొక్క ముంతమామిడి మొక్కఁ, దోయమెత్తవలెంచుఁ దొలఁగెనొకర్తు
చిలుకలేటికొ దమిబిత్తరపుఁ జూపుక్కులు నేర్పి, పూరి మేపెదనంచుఁ బోయెనొకర్తు
కలమంపు టెండువుల్ గవయంపుఁ బండువుల్, చూచివచ్చెదనంచు జూణిఁ గెనొకర్తు
లేఁత నివ్వరి దొంపు లేటిపిల్లలకింపు, కాచియుండెదనంచుఁ గదలెనొకర్తు

తే. ధార్యమర పెదననితప్పదాఁ టెనొకర్తు, వైద్యుఁ బిలిచెదనని జాఱువాఱెనొకర్తు
మాయములు పన్ని యీలీల మహిపుమ్రోల, బాలనిడి హేలనరిగిరి ప్రాణసఖులు. 33

వ. ఇట్లు తన్నొక్కతెం డించి సఖీజనంబు నలుగెలఁకులం దలఁగిన సుజ్ఞాతంబులగు లజ్జాభయంబుల నజ్జలజముఖి నృపాలుని పజ్జ నేకతంబ నిలువఁజాలక. 34

చ. కులుకులెసంగ నబ్బురపు గుబ్బలు గుబ్బతిలంగ మేనిచా
యలు చిలుకంగఁ గొనమలియంగ మొగమ్ముఁ గ్రమ్మి చెమ్మటల్
జిలిబిలి పొంగఁ బొందళుకుఁ జేల మెఱుంగడరంగఁ గంకణా
వలిగలుగల్లనంగఁ బఱవంగ మకింనెలతాంగి సిగ్గునన్. 35

వ. ఇత్తెఱంగున నంతరంగంబునం దుఱంగలిగొను వెఱంగునం గుఱంగట నిలువంజాలక నక్కురంగలోచన మెఱుంగుదీవి యొకరణి మణిస్తంభంబులమఱుంగునకుఁ బరుంగు వాఱినం బవిత్రయమాత్రంబున నద్ధాత్రీకళత్రుం డక్కాంచనగాత్రిం దొట్టి చేనట్టి కవుంగిటికిందిగిచిన నెగిచి దిట్టతనంబున నిట్టట్టు గినురుపలిచి సురుచిరగతింబఱచినం గకలినమరులునఁ గ్రమ్మఱ నమ్మరునంపు మొలకం బలుకరించుచుం గదిసి సన్నధ్యంబగు నక్కన్యకామధ్యంబుఁ బిడికిటంగీలించి లాలించుచు నధరామృతం బాస్వాదింపంగమకింపం దమకింపక చంపకగంధి గంధసింధురం బాక్రమించినం జలియించుతీరు గకరిణీలలామంబుచాడ్పునం గాడ్పునం గనుకంపనశకాంతాంబుకైవడిం గైవడి నెవ గలుగం జడియుచు నొడంబడ నిలయించం బంచశరశరపరంపరాపరాభూతంబైన సుహృజ్జలజాతంబుతో ని ట్లనియె. 36

క. పలికీ పలుకవు మరుపూ, ములికీ! యీ యంచగముల మురిపంపుహళా
హలికీ పరిసరతరుసర, వలికీ రార్భటికి డెందమలికీఁ గలికీ! 37

సీ విరహపాథోరాశి వెల్లివిఁగఁ గ్రోడం గె, వనువరిఁ జేయ్వు ఋనావభంగిఁ
గామాంధకారంబు ఘీమమైకొనలిం నెఁ, గవతేఱ్పుము రుదీపకలికభాతి

మదనమాంద్యమున నెమ్మది బోధరాదయ్యెఁ, గావుము సంజీవకరణికరణి
నతనుతాపభరంబు మితిమీఱిసాగియుంచె, మనువుము శర్కరాంభములపగిది

తే. నతులతాపకరూపరేఖానురాగ, రసఝురవిహారకలితజాగ్రన్మనోజ
భూతవేదన నెంత యుభీతివొడమె, యువతి! నీ సూక్తిమంత్రమ్ము లొలయనిమ్ము. 38

సీ. మొనగుబ్బలెదఁ జేర్చి మోవితేనియ లిచ్చి, ముచ్చటల్ దీర్పవే ముద్దుగుమ్మ!
కొసరుపై పులకవ్వికొనగోట దువ్వినా, తమి విస్తరింపవే తలిరుఁబోణి!
పొందిపాయఁగఁ బాసి పాలయల్కఁ జేసినా, బోధనల్ వినఁగదే పువ్వుఁబోణి!
మగచందమునఁ గల్కి మాయముల్ పల్కినా, మదికింపుఁ గూర్పవే మచ్చెకంటి!

తే. పరిపరివిధంబు రతులకేర్పడిన మేటి, యంగములకెల్ల మనికిపట్టైన బోటి
విపులసింగాణిసురధాణివిజయధాటి, మేదినీస్థలిఁ గలుగునే నీదు సాటి. 39

వ. అని యనేకప్రకారంబులం బ్రార్థింప సాచిస్మితలసితంబుగా మొగంబు వాంచి యొక్కిం
చుక భావించి యక్కాంచనగాత్రి గోత్రాకళత్రునితో నిట్లనియె. 40

ఉ. అక్కట! తాతకశ్యపులయావరణంబున మున్న దానన
న్నెక్కటి నిట్లు పేర్కొనుట యే వివరం బిది యేటి గొండ్లి మీ
యక్కఱ దీఱెనంచి వపనాఱడిఁ ద్రోచెద రేల యేల నే
నెక్కడిదాన నయ్యెద మహీవర నేవరమర్థి వేఁడెదన్. 41

ఉ. వైశముకణ్వులింతకును వత్తురు వారలయానతిం గడుం
దాలిమిఁ బెండ్లియాడుము యథావిధి నంతకు నీకు నెమ్మదిన్
దాళిక లేక యుండి నహితమ్ముగ నేని యుదగ్రభార్యగా
నేలుము నన్ను నుత్సుతునకిమ్ము మహీవలయమ్ము సమ్మతిన్. 42

సీ. అదితిమాయువ్వ కశ్యపుఁడు మా తాత సూ, తొలుత వారలకెల్ల దోఁచనొక్కొ?
తాతకశ్యపుల చిత్తము కందు వసను సూ, దుర్వృత్తయని ప్రేమదొఱఁగునొక్కొ?
నా ప్రాణసఖుల చందము నమ్మరాదు సూ, సుబ్బుసుబ్బుల మాఱఁజూతురొక్కొ?
యండఁబొందినవారలా చాపరులు సూ, బాగుగావని బాహ్యపఱుతురొక్కొ?

తే. యహహ! రాజరాజయ్యా జవంజవసుఖా, సక్తియుక్తి నోలి సాహసమున
నీ మనోరథంబు నెఱవేర్తు నేనియును, నవుల నెట్లు సైతు రార్యజనులు. 43

వ. అని యిట్లు బహుప్రకారంబులం బరిహరించు నమ్మించుఁబోణి నుపలాలించుచు
నిట్లనియె. 44

శా. కానిమ్మేని ను నమ్మి నగ్రమహిషింగా సంతరింతున్ భవ
త్సూనుం బట్టముగట్టుదున్ మనకు సాక్షుల్ వాసరంబుల్ నిశల్
భానుండున్ శశి పంచభూతములు దిగ్భాగంబులున్ గాలమున్
శ్రీనారాయణదేవుఁడుం గలఁడు శిక్షింపం గరక్షింపఁగన్. 45

వ. అని యమ్ముద్దియ నెట్టకేలకు నొడంబఱిచి సురుచిరాకల్పం బగుకిసలయతల్పంబునకుం దిగిచి. 46

శా. కాంచన్ గామినికామినీయముబలాత్కారంబునం గేలఁగీ
లించన్ వేనలిచెక్కునొక్కి కడుబల్మిం గుబ్బపాలిండ్లనం
కించంగాఁగిటఁ జయ్యకుందిగిచిసొక్కించంగళాపైఖరిన్
గించిన్మధ్యఁగరంచియీసరణిభోగించెన్ విభుండయ్యెడన్. 47

సీ. కొమ్మ! నీ నెఱికురుల్ కొదమతుమ్మెదలంచు, సోయగంబరుదారఁ జూచునొకటఁ
గలికి! నీకెమ్మోవికండచక్కెర యంచు, గొడఁగిపానకమానఁ గోరునొకట
నెలఁత! నీచెక్కులునిలువుటద్దములంచుఁ, దనమోముకహిఁ గాంచఁ దలఁచునొకట
భామ! నీపాలిండ్లుపసినిమ్మపండ్లంచు, నీటు గాఁగొనఁగోటమీఱునొకటఁ
తే. గు[illegible]కులమిటారి! చిలుకలకొలికివనుచుఁ, జెలఁగితమిదీఱఁగౌఁగిటఁ జేర్చునొకట
బాల! నీలీలఁగరఁగించిపార్థివుండు, హాలినిష్టోపభోగంబులం గాంచెం డె. 48

వ. మఱియును. 49

సీ. కొసరివాతెఱ నొక్కి కసుఁగందెనోయంచు, నిరతుఁడై మ్రుంగేలనివిరినివిరి
గోటగుబ్బలుమీటి నాటెనోయనుచుఁదా, నార్తిచేఁ గుంకుమంబలఁదియలఁది
వెలయఁ బాన్పునఁదార్చి వీరులాత్తెనోయంచు, వగపుచేనురముపైఁదిగిచితిగిచి
తమిదీఱభోగించి శ్రమమయ్యెనోయంచు, వెఱపుచేపీనఁ ల్ విసరివిసరి
తే. సోయగముఁ గాంచి తిలకించి సొబగుమించి, ముసలు నెరలించి తెరలించి మదిఁగరంచి
యఱమఱలుదీఱలాలించియామతించి, కలికితో లీలమాటమి విభుండు తులకరించె. 50

సీ. తరసాఘనస్తనస్తబకాదయాశ్లేష, చలితబాలావక్త్రజలరుహంబు
పతికరవ్యతికరభ్రశ్యత్సువాసాంధ, వనితానవాఖకుంతనపటంబు
రమణసంక్రమణసంభ్రమవివర్తితయోషి, దఖిలాంగసంగిభూషారవంబు
పురుషాధిగమసుఖస్ఫురితాశ్రులనలస, న్ముగ్ధాముహుర్నేత్రముకుళనంబు
గీ. రభసవిలులితశయ్యోత్తరచ్ఛదంబు, పులకములుకితపర్వణోత్ఫుల్లగల్ల
ముల్లలత్కేశపాశమన్యోన్యరాగ, నిరతిశయమయ్యె నవయువనిధువనంబు. 51

శా. ఆలోలాలకమాచలత్కుచభరంబాస్విన్నగల్లద్వయం
బాలీఢప్రియపాణిపల్లవనితంబాశ్లేష మామీలదు
న్మీలల్లోచన మాత్రపాభరదరస్మేరాననాంభోరుహం
బాలంబాభరణంబుగానుపరతంబాలేను సల్పెన్ గృతిన్. 52

వ. ఇవ్విధంబున నాదంపతు లతులసంపదలం బొదలుచు నిద్రాపారవశ్యంబునం దనరు నవసరంబున. 53

ఉ. తోయజవైరి మాసె రవిదూర్పుదెస న్బొడచూపెఁ జుక్కలుం
జాయలుదీసెఁ గైరవిణి సైకమునంగను మూసెఁ బద్మినీ
నాయికకుందువాసె రతినాథుఁడు వాలారఁజేసెఁ గొక్కరో
కోయనికోడి కూసెనలకోకిని గోకముడాసె నత్తఱిన్. 54

ఉ. పూవులతావులం దనరి పొందిక కందిక లియ్య శయ్యలం
దీపలనాపలం బెంఁగియింపు రహింప సతుల్ పతుల్ ధృతిన్
భావజకేళిఁ దేలునెడఁ బట్టినచెమ్మటలారఁ దోరమై
వీవఁదొడంగె సంగముల వేఁకువ తేఁకువఁ గమ్మతెమ్మెరల్. 55

ఉ. సారెలసత్సహస్రకరశాఖలతో నిసుఁడుగ్రమూర్తియై
ఘోరతిమమ్ములం దొరగఁగోరిన మున్నడియై యనూరుఁడున్
ధీరతమీఱ నయ్యరులతేకువమాన్పఁ బెలంచెఁ జన్ మహా
శూరులఁ జేరుభీరులను జూపుదు రుద్ధతి యుద్ధతీవ్రులై. 56

వ. ఆసమయంబున. 57

ఉ. గాములమేటి లోకములకన్నుఁ దమిస్రములమిత్తి యామినీ
భామతొలంగుబావ సెకవాఁకలగుండము చక్రవాకపు
న్నోములమెట్టపంట పదినూఱులచేతులజోదు పచ్చబా
బామునచూపుతేరదొరభానుఁడు తూర్పునఁదోఁచె నత్తఱిన్. 58

క. ఆలోచనతా మేల్కని, బాలారత్నంబు కూర్మిపతికౌఁగిటిలో
నాలీఢయగుటఁ గడలక, మేలమ్మునఁ నుండె విభుఁడు మేల్కనునను చున్. 59

వ. తదనంతరంబ మేల్కాంచినపతిం గాంచి సప్రణయంబుగాఁ దచ్చరణంబుల కెరఁగి తదనుజ్ఞాత యై. 60

శా. పీఠంబాఱవ నవితోఁ గటీనటద్వ్యోశీలలాసంబుతో
వాడుం దేఱునపుష్పమాలికలతో వ్యత్యస్తహారాళితో
ప్రీడానమ్రముఖంబుతో శ్రమజలావిద్ధాంగరాగంబుతోఁ
గ్రీడాతల్పము డిగ్గెబాలసురతక్లేశావశ్రాంగియై. 61

వ. ఆసమయంబున. 62

శా. తానుం బానుపు డిగ్గి యగ్గలిక సద్ధాత్రీకళత్రుండు స
న్నానానూనకటాత్మపితృణములన్ మన్నించుచున్ ప్రీతుఁడై
చానం గౌఁగిటిలోనికిం దిగిచి విశ్వాసంబుతో నిట్లనెన్
మానం బేటికి ముద్దుగుమ్మ! సెలవిమ్మా సమ్మతిన్ వీటికిన్. 63

తే. అనుచుఁ గవనోన్ముఖుం డైన యధిపు మోము, రాచసిరికన్నె తప్పకచూచిచూచి
ప్రాణనాయక! నన్నెపొఁ బాయఁ జాలఁ, దోడకొనిపొమ్ము నన్ను నీతోడ నిమ్మ. 64

మ. అనుచుం గుత్తుకదొట్రుతోఁ బలుకుతో నాకుంచితాంగంబుతోఁ
గనుదోయి న్నొలుకొన్నబాష్పములతో గాటంపునిట్టూర్పుతో
జనితస్వేదకపోలపాలికలతో జవ్వాడుమధ్యంబుతో
వనితారత్నము వెన్నడిన్నడువ శేవన్ భూవిభుం డిట్లనున్. 65

క. కొమ్మా! యిన్నాళ్ళటనె నెల, కొమ్మా నెచ్చెలులఁగలసికొమ్మా నెఱచే
కొమ్మానులపతియనుమతిఁ, గొమ్మా నాసేఁసుమరసి కొమ్మా పిదపన్. 66

ఆ. ఆజ్ఞమీఱినపదియయ్యయో! దీనికి, వన్నెవెట్టినట్లు వంచనమున
వచ్చెదేని గారవమ్మున నినుఁజూడఁ, గాఁకలుగుమాని మానసమున. 67

క. కోపించుం గ్రక్కున నా, క్షేపించున్ గానమానిచిత్తముకూర్మిన్
రూపించినగరమాదటఁ, బ్రాపింపుము హితులఁ బనుతుఁ బద్మదళాక్షీ! 68

వ. అని బహుప్రకారంబుల నోడంబఱచి గాఢాలింగనంబాచరించి యక్కాంతాలలామంబు సప్రేమంబుగా వీడుకొలుపం బ్రీతుండై యశ్రమంబున నయ్యాశ్రమంబు వెలువడి బలువడిం బయనంబు సాటించి చతురచతురంగసేనాపరివృతుండై హస్తిపురంబుఁ బ్రవేశించి యథాపూర్వకంబుగా రాజ్యంబుఁ బాలించుచుండె నంత నిక్కడ శకుంతలావధూటియు సప్రీతంబుగా సఖులకుం గడనూపి యథోచితవర్తనంబునం బ్రవర్తిల్లుచు నాత్మగతంబున. 69

సీ. నచ్చెఁబో కణ్వసేవాకుతూహలమునఁ, బొదలచాటునరాజుపొంచ నేల?
పొంచెఁబో చిలుకనుబూబంతినఁబువేయఁ, విప్పి యవ్విభుఁడొమ్ముఁ బువుల నేల?
తలఁచెఁబో యదినిమిత్తముచేసియుదయంబు, భావజుష్టంబుగాఁ బలుక నేల?
పలికెఁబో తల్లిదండ్రులయాజ్ఞఁ గొనకనే, జగతీశ్వరునికూర్మి నలుప నేల?
తే. చలిపితనిబో నృపాలుండుసంయమీంద్రు, నాజ్ఞఁ గొనినన్నుఁ దోడ్కొనకరుగ నేల?
తలఁచినతలం పెదైవంబుఁ దలఁ నెంకటు! యెట్లుగానున్నదో కోమిఁ యీశ్వరాజ్ఞ? 70

క. ఆమునికులసోమునితో, నేమనివివరింతు మఱియునిదివివరింపన్
గామినిపరగామినికొఱ, గామినిజంబనుచుఁ గవలిగర్హించునొకో! 71

వ. అని యిత్తెఱంగున విచారడోలాయత్తం బగుచిత్తంబుతో నున్మత్తకాశినితత్తఱంబునం బలయోత్తి తన యగ్రభాగంబున. 72

సీ. పరమార్థతత్త్వానుభవమువక్కాణించు, సమధిక బ్రహ్మవర్చసమువాని
కైవల్యవాంఛానుకలనంబువివరించు, వ్యాఘ్రాజినోత్తరీయంబువాని
వెలిచూడ్కిలోలక్ష్యమాలఁతిబాహిరముగా, మునుకొన్నశాంభవీముద్రవాని
వేదముల్ మూర్తీభవించుమేదలపించు, సముచితాధ్యయనఘోషంబువాని
తే. హుతహుతాశనతేజుఁడై యుష్ణవాని, హరిచరణకృతిపుంభానమైనవాని
నాశ్రమాభిముఖంబుగా నరుగుదెంచు, తాతఁగిర్యప్రఁబొసఁగాంచెఁజెలియఁబోలి. 73

వ. ఇవ్విధంబునం బోఁడ గాంచి భయలజ్జాసంభ్రమంబులం దొట్రుపడుచు నభ్యుత్థానం బాచరించి. 74

సీ. ప్రమదాశ్రుజలముచేఁ దెమలు కాటుక జీర, తులుకుఁ జెక్కులజాఱు కురులు గ్రమ్మ
మవ్వంపు మొలక చెమ్మటల నెన్నుదుటిపై, బొరలు పాపటము త్రెసరులు దాఁప
మురిపంబు గులుకు సుపల్లానలవా తెరఁ జిందు, కెంపుముక్కఱనాయకికురుపఱుపఁ
గళుకైన నిలకూనగములఁ బేరురముపై, రమణీయ చంద్రహారములు మూప
తే. నిదుర వేగింపుఁ గన్గెంపు సదములంపు, మొలక సిగ్గున నగపడు మొగపు దిగువ
నొడలి బడలిక గరువంపు నడలు దాఁపఁ, దండ్రి కెదురేగి మ్రొక్కెన తలిరుఁబోణి. 75

క. మ్రొక్కిన గాదిలిపట్టిన్, మక్కువ దవులుకొ త్తఁ జూచి మౌని మనమునన్
జొక్కమగు దివ్యదృష్టిం, గ్రక్కున భావించి తెలిసె గత మున్నఁడై. 76

వ. ఇవ్విధంబునం దనదివ్యజ్ఞానంబునం గూఁతుం దుష్యంతుండు గాంధర్వవివాహంబునం బరిగ్రహించుటయుఁ, గన్యామణికిఁ దన్మూలంబున గర్భప్రాప్తియుం గాఁగల సంపల్లాభంబునుం దెలిసి కృతకృత్యుండై కరుణార్ద్రకటాక్షవీక్షణంబులం దత్క్షణంబ యయ్యుభయానభయానకరసంబువాపి మధురాలాపంబుల నుపలాలించుచు నిట్లనియె.

శా. అల్లుండయ్యె మహామహుండయిన దుష్యంతుండు ధాత్రీతలం
బెల్లం దాలుచు చక్రవర్తిసుతుఁడై యిప్పాట నీకుక్షిరా
జిల్లె న్నేఁడ్దొరసానివై తివి జళీ ! చిన్నారి పొన్నారి నా
తల్లీ ! ధన్యతఁ గంటి నీవలనఁ నాదౌహిత్రలాభంబునన్. 78

వ. అనుచు నాశీర్వచనపూర్వకంబుగా నక్కన్యామణిం దేర్చి సంబోధనం బాచరించి ప్రియంవదాదిసఖీలలామంబులం బిలిచి యివ్వరారోహ దౌహృదవతి యగుట నెద్దె నియిది వాంఛింపం దొరకొని మార్గ్యంబున వాక్రువ్వం జాలకుండుం గావున మనోరథంబు దని సమకూర్చునది యని యాదేశించి యథానుగుణంబుగా వర్తింపం గూఁతు నాజ్ఞాపించి తాను యథోచితవర్తనంబునం దనరుచుండె న య్యవసరంబున. 79

తే. పౌరవాన్వయమున కాదికారణంబు, కణ్వదౌహిత్రలాభైకకల్పభూజ
మాళిజనదర్శనోత్సవమల శకుంత, లాయువతి దాల్చె దౌహృదలక్షణంబు. 80

సీ. కలలపోషణసుధాకలశముద్రలరీతి, నలినాక్షి చను మొనల్ నలుపులయ్యె
మనుపనాదొరగాంచు మధ్యలోకము భాతి, వెలఁదుకమధ్యంబు విస్తరించె
గర్భార్భకుని యూర్పు గాడ్పుతో డప్పడినట్లు, హ్రీమతీమణి యూర్పు లినుమడించె
నత్యజవయానిర్వదహితావళులమాడ్కి, లలితాంగి వళులు పేలవములయ్యె
తే. జఠరపిఠరాంతరాళ కాసారసార, సంపదంసలహంసప్రచారచారు
తరతనుభవానుభావంబు తనరులీల, నరయ నవయంగఁ జెలియానమలసమయ్యె. 81

తే. పంచభూతగుణంబుల పట్టుఁ గొమ్మ, భూరిరసవర్గములకెల్లఁ బుట్టినిల్లు

అనిరపారసమాత్మజాఁడరయఁదలఁచి, మన్ననాచవిగాంచెనమ్మధురవాణి. 82

సీ. శరభశార్దూలాదిసత్త్వంబులనుబట్టి, ధీరధోరణినిరోధింపఁగోరు
శైలంబుశైలంబులీలతోనిరుగేల, నిడితాళగతులవాయింపఁగోరు
నుద్భటప్రతిభటవ్యూహంబుపైఁగిట్టి, యస్త్రశస్త్రములనూటాడఁగోరు
నిద్ధారుణీచక్రమేకచక్రంబుగా, నింపుసొంపారఁబాలింపఁగోరు
తే. వాజపేయాధ్వరశతంబు వరుసఁజేసి, యూప్సితార్థంబు ద్విజకోటి కిడఁగఁగోరు
నార్యవార్యమనస్థైర్యధైర్యశౌర్య, దుర్భరార్భకనిర్భరగర్భయుక్తి. 83

వ. ఇట్లు సంవత్సరత్రితయంబు గడచునవసరంబున. 84
క. ప్రాంచత్తుంగస్థగ్రహ, పంచకమై యుల్లసిల్లుపటులగ్నమునన్
గాంచనగాత్రితనూభవుఁ, గాంచెన్ భరతున్ భుజోపగతలాభరతున్. 85
మ. వసుధాచక్రమవక్రమై విలసిలెన్ వార్ధుల్ చెలంగెన్ నదీ
విసరం బచ్ఛపయఃప్రవాహములఁ బర్వెన్ దారకానాథుఁ డు
ల్లసితుండై తనరారె దేవగణికాలాస్యంబు మీఱెన్ దెసల్
వెస రాణించె శకుంతలాతనయునావిర్భావకాలంబునన్. 86
వ. తదనంతరంబ యక్కుమారుండు తాతవలనం జాతకర్మాదిసంస్కారసంస్కృతుండై
పెరుగుచు. 87

సీ. ఆకాశకూలంకషాకాశవనవాటి, నుదయించుబాహులతేయునివిధమున
క్షీరపారావారభూరివీచిమతల్లిఁ, గనుపట్టునవసుధాకరునికరణి
వాసవాశావధూవరగర్వసరణంబు, గడచిరాణించుభాస్కరునికరణి
నిగమాగమాచారనిర్మితాధ్వరవేదిఁ, దులకించువీతిహోత్రునివిధమున
గీ. గుహవెడలి మీఱుసింగంపుఁగొదనుపగిది, గనిఁ బొడమిపేర్చుబలమానికంబుమాడ్కి
వర్ణితాతిగఫలకవికీర్ణచూర్ణ, కుంతలుండై తనర్చెశాకుంతలుండు. 88
సీ. సరసార్భటీమేటిశరభసాళువకోటి, పరభయంకరధాటిఁబరిభవించుఁ
గుంచితోరుకఫోణినొంచిదక్షిణపాణిఁ, బంచాననశ్రేణిఁగొంచెపఱుచు
వారణంబులఁగిట్టిపోరితొండముఁబట్టి, భూరుహమ్ములఁ గట్టికేరుచుండుఁ
జండవైఖరిమీఱి కొండగోయలఁదూఱి, గండకమ్ములఁజేరిబెండువఱుచు
గీ. రురుతరక్షుసృగాలశార్దూలకోల, ముఖముఖరదుష్టసత్త్వసమూహమూహ
మోహరింపఁగఁబెగవాఱిసాహసమున, డిందుపఱుచుశకుంతలానందనుండు. 89

వ. ఇవ్విధంబున నిసర్గబలానర్గళభుజార్గళుండై దుర్గంబులగు కాంతారమార్గంబులం గ్రుమ్మ
రుమహాసత్త్వంబులగు దుష్టసత్త్వంబులం బట్టి యక్రమంబున నాశ్రమతరులం గట్టిపట్టు
పఱుచుశకుంతలపట్టిం జూచి వాచంయము లాశ్చర్యచర్యుండగునీశౌర్యధుర్యుండు

సర్వదమనుండను నామంబునం బ్రఖ్యాతుండయ్యె నని దీవించినం గాంచి కణ్వమహా
ముని ప్రహృష్టాంతరంగుఁడయ్యె నిట్లు యౌవరాజ్యపట్టాభిషేకార్హుండగు కుమారుం
జూచి తనయోగక్షేమం బారయు నెడఁ బ్రమత్తుండై యున్న నృపసత్తము వృత్తంబు
నకు విచారడోలాయత్తంబగు చిత్తంబుతో నత్తమిల్లి వేగుతటి మేల్కాంచి ప్రియం
వదతో శకుంతల యిట్లనియె. 90

సీ. విరులపానుపుమీఁదఁ బొరలుచుండెడు వేళ, వరదుఁడై నాథుండు వచ్చినట్లు
నాథుఁడు రాఁ జూచి నగుచు దిగ్గన లేచి, యొగి నేగి పదముల కెరఁగినట్లు
పాదపద్మములపైఁ బడిన మెల్లన నెత్తి, గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుకొనినయట్లు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొనిన సంభ్రమించుచు, హాయలుగాఁ బాన్పుపై నునిచినట్లు
తే. హాయలుగాఁ బాన్పుమీఁద నన్నునిచి నునిచి, మరులుగొలిపించి లాలించి మదిఁ గరంచి
యతులగతులను రతులను నలరినట్లు, మేలుకలఁ గంటి నంతట మేలుకొంటి. 91

శా. లేమా! లేమరలేమ కల్పకవిశాలిందూలిసోమాన్వయో
ద్దాముఁ గోమున నాముకొంటినఁట వే తానై హితాలాపముల్
ప్రేమం గోమలకోమలాక్షరముగాఁ బెక్కాడి సోకింపఁ బ
ర్కామింగా మిని కామినీమనసిజుం గ్రై కొంటి నా కౌఁగిటన్. 92

ఆ. ఊరులు మరులుకొల్పి యూరించి యూరించి, కానిపోని బూటకములఁ దేమలి
కలసి మెలసి తానుగాని వానివి తాన, రాజరాజు మరల రాఁడు నేఁడు. 93

మ. తలిదండ్రుల్ దొలుదొల్తఁ గూఁతునకు నుద్వాహంబు గావింపగాఁ
దలఁపుల్ పుట్టినవీర్యశౌర్యగుణవిద్యాసంపదాచారపు
ష్కలమూర్తిన్ వరుఁ గూర్తురత్తఱిఁ గుమన్ గావయ్యె నాదైవపెం
డిలియె వ్వారలనొవ్వనాడు గువధూటీ! నిక్కమూహింపుమా. 94

క. పంపుము హితులన్నినరా, వింపుము నని నన్నుఁ బలికి విభుఁడత్తఱిఁ గా
హింపక పోయిన నన్నుం, గారింపం దొరఁకొనియె శమనరీతి వనీతిన్. 95

వ. అని యివ్విధంబునం గజ్జలఝుళఝుళంబు లగు బాష్పజలంబులు కుచలికుచంబులం జాఱం
జారుముఖి ముఖంబు వాంచి విన్ననై వెచ్చనూర్చుచున్నం జూచి ప్రియంవదనయంబొన
వనూనయించి కొండొకయవసరంబునం గాశ్యపుల కక్కోమలి మనోభావంబు విన్న
వించుటయు. 96

తే. కాంతు నానన మెప్పుడు గాంతు ననుచుఁ, గోరికలు గూరు గాదిలికూఁతుఁ జూచి
యౌవరాజ్యపట్టాభిషేకార్హుఁడైన, భరతు నిరతశయోత్సాహభరితుఁ జూచి. 97

వ. తదనంతరంబ యమ్మహాత్ముండు దనదేవి యగు గౌతమిం జేరంబిలిచి గారవంబున శకుంత
లావధూటిం బిలువం బనిచి సన్నిధిం గూర్చున్న తనయ నుద్దేశించి తనపత్నితో నిట్లనియె.

క. పెనిచితిమి పెద్దఁ జేసితి, మనుకూలుఁ శుభర్తఁ గలిగె నాత్మజుఁ డొదవెన్
దనయామణి కత్తింటికిఁ, బనుపక యిట్లునుచు టేమి భావ్యము సాధ్వీ! 99

క. తనుపందగు పద్రసముల, మనుపందగు భూషణములను మునికూతుం
బనుపందగు నత్తింటికి, ననుపంపఁగుఁ దగుసహాయ మాత్మజ సోదన్. 100

వ. అనుచుం దనదేవి నొడంబఱిచి తత్తదనుకూలంబులగు వస్తుజాలంబులం దత్తఱంబ సంఘటించి యాశ్రమనివాసులగు భూసురులకు సంతర్పణంబు గావించి మునుమునిం గూఁతునలంకరించుటకుం బ్రియంవదాదులం బనిచిన వార లక్కీరవాణిం జీనాంబరాభరణమాల్యాంగరాగంబులం గైసేసి భరతుం గాంచనాభరణవిస్ఫురితుం గావించి గౌతమియుం దారు నచ్చేడియం గణ్వులసన్నిధికిం దోడితెచ్చిన నచ్చెలువ జననిజను పునం దనచరణంబులకుం బ్రణమిల్లి సన్నిధిని సప్రశ్రయంబుగా నిలిచి కన్నుంజూచి తద్వియోగవ్యథావిధురహృదయుండై యమ్మునివరుం డిట్లనియె. 101

చ. కనుఁగవబాష్పపూరములు గ్రమ్మెడు గద్గదకంఠ మయ్యెలుం
గనుపునరా దుసూహృదయమాకులమయ్యెడు మేను మ్రాన్పడుం
బెనిచినవానికింతవగఁ బిమ్మటి గ్రమ్మెడు కన్నవారలుం
దనయనుబంపలేక పరితాపభరంబున నెట్లు సైఁతురో. 102

తే. అనుచు వెతనొందు జనకుని యాననంబుఁ, జూచి యడలూన భాషించె సుందరాంగి
బాఁతి మైత్రాఁ జపెట్టిన పావకంబు, వీవనంజనఁ బైపయి విసరినట్లు. 103

సీ. బలిపుష్టములబారి తొలఁగించి మనుచుమీ, కోకిలార్భము తేజుకొని తీరు
పిన్ననాటనుగోలెఁ బెనుపఁ జూలైనయీ, హరిణిబాలింతరాలైన మేలు
నోనాటములుదీసి మానుమందిడినయీ, నెమలినోగంటి మానినవిధంబు
నేనాడు శాలూని మూఁనఁ బెంపైనయీ, చెంగల్వకొలను పూచిన తెఱంగు

తే. అయ్య! మనశార్ఙ్గరవునిచేనైన చిత్ర, భానుచేనైన శృంగిచేనైనఁ గ్రోధి
చేనయినఁ జెప్పిపనుపుము చెప్పిపనుప, వేని వేయేల నీకు నాయానసుమ్ము. 104

సీ. తోయంబు గామీకుఁ దోయమెత్తక కాని, తోయంబుఁ ద్రావదీ తోయజాక్షి
చివురెత్తు వేడ్కమై చివురు గైసేయమీ, చివురందఁ గోరదీ చివురుఁబోణి
కుసుమాపచితి నన్యకుసుమంబ కానిమీ, కుసుమంబుఁ గోయదీ కుసుమగాత్రి
ఫలదానములకై నఫలియించియున్నమీ, ఫలమంటదీ మహోత్పలసుగంధి

తే. యట్లు మిముఁ బ్రోదిలాలించి యారయుచున్న, యంశకుంతల నవధూసుమారు తోడ
నత్తవారింటికేగెడు నాదరమున, నాజ్ఞయీఁ దగువన భూరుహంబులార! 105

వ. అనుచు వనతరునికరంబుఁ గనుంగొని శకుంతలతో నమ్మహాముని యిట్లనియె. 106

మ. కలికీ! యత్తలు నీవు వోవు టెఱుఁగుం గాఁబోలు నిప్పాటని
కళలరంభాతరువుల్ సుడింబడి వడింగంపించె దోర్యత్సవ్యలతల్

తలవాంచె న్నెఱిచూతజాతములు చింతం బల్లవశ్రేణినొ
చ్చిలు నీహారము పేరనశ్రువులుగా ర్చెంగంటివే కోమలీ ! 107

వ. అనుచు నిత్తెఱంగునం జనకుండునుం గుమారియు నొండొరుల నెడంబాయంజాలని నెనరునం దనరు సల్లాపంబులఁ గాలయాపనంబు సేయం జూచి శార్ఙ్గరవప్రముఖు లగు శిష్యు లక్కాశ్యపులం గాంచి తత్త్వజ్ఞానసంపన్ను లగు మీరలివ్విధంబున విపన్నభావంబు నొందిన నియ్యిందుముఖి డెందంబున మఱియునుం గుందుచున్నయది యదియునుం గాక ప్రయాణముహూర్తంబు సన్నిహితంబై యుండెం గావున ధైర్యం బవలంబించి యిక్కాంచనగాత్రికి హితం బుపదేశించి సత్వరంబుగాఁ బనుప నవధరించునది యని విన్నవించినం గొండొకసేవచేతి యమ్మునికులశ్రేష్ఠుండు వనితాజనమూర్ధన్య యగు నక్కన్య నీక్షించి యిట్లనియె. 108

మ. గురుశుశ్రూషలు సేయుమీ సవతులం గూర్మిన్ విలోకింపుమీ
పరివారమ్ములఁ బ్రోవుమీ సిరులగర్వస్ఫూర్తిఁ గైకోకుమీ
పురుషుం దూఱకుమీ సతుల్ నడచునేర్పుల్ నీకు సూచించితిన్
దరుణీ లోకమతల్లి చేకొనవె మాతల్లీ మదీయోక్తులన్. 109

వ. అని సముచితప్రకారంబునం గూఁతునకు హితోపదేశంబు చేసి మనుమనిం గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి మూర్ధాఘ్రాణం బాచరించి యథోచితంబుగా వీడుకొలిపి శార్ఙ్గరవప్రముఖుల సహాయంబుగాఁ బనిచి తానునుం గౌతమియుం గొండొకదవ్వసపి ప్రఫుల్లహల్లకకల్హారసముల్లసితసౌరభసమీరవిహారం బగు నొక్క కాసారతీరంబున నిలిచినం గాంచి శకుంతలయు భరతుండునుం బునఃపునఃప్రణామంబు లాచరించి సంప్రీతు లగు జననీజనకుల చేతం గ్రమ్మఱ ననుజ్ఞాతులై కతిపయప్రయాణంబులం జనిచని గగనకూలంకషాభరణంబు లగు ప్రతప్తకార్తస్వరభాస్వరవరణంబులను, కనత్కనకఖచితకాశ్మీరహీరరశ్మిచ్ఛటాసనాథంబు లగు సౌధంబులను, విద్రుమలతావితానమానితజాలకంబు లగు గోపురాట్టాలకంబులను, మదకలస్తంబేరమగమనాగమనదుర్గంబు లగు రాజమార్గంబులను, నానావిధభవ్యద్రవ్యసన్నివేశంబు లగు విపణిదేశంబులను, నయనాభిరామంబై యున్న యక్కరినగరంబుఁ బ్రవేశించి యరుగుచున్న యక్కాంచనగాత్రిం గాంచి యద్భుతరసావేశంబున నప్పురపురంధ్రీనికరంబు తమలోన. 110

సీ. నెలనాటి లేటిపిల్లలకుఁ జూడ్కు లుదిద్దు, కలికిబిత్తరపుఁ గన్నుల బెడంగు
వనలెత్తు పవడంబునకుఁ గెంపు రహి నింపు, తెఱవ మవ్వంపువాతెఱ తెఱంగు
నిద్దంపుటద్దంపు నివురు దీర్పఁగ నేర్చు, కులుకు మిటారి చెక్కుల మెఱుంగు
నిసువు రేఁడని మేనికిఁ గళల్ దులకించు, లలనాలలామ ఫాలమ్ము సొబగు

తే. పసిఁడికిని వన్నియలు వెట్టుభామమేను, చదలునకు సత్పథంబూనుచానకాను
శ్రీకి నవకంబు నాటించుచెలియవీను, లహహ జగదేకమోహనం బతివసొబగు. 111

వ. వెండియు. 112

సీ. నెఱనీటుగలవాఁడు నిద్దంపుటద్దంపు, దంబూనుగల్లద్వయంబువాఁడు
మాడఁజక్కనివాఁడు సురరాజకరిరాజ, కరిరాజదురుదోర్యుగంబువాఁడు
కలికిచూపులవాఁడు చెలువంపుబలుకెంపు, లలినింపునధరపల్లవమువాఁడు
మొలకనవ్వులవాఁడు మురిపెంపుసిరిపెంపు, మురివింపఁ గులుకు నెమ్మొగమువాఁడు
తే. హారయలుగలవాఁడు వెడలుపుటురమువాఁడు, సమధిగతచక్రవర్తిచిహ్నములవాఁడు
హావణిమారట దుష్యంతుఁడనఁగఁ జాలు, బాలుఁడీబాలికామణిబాలుఁడెట్లొ. 113

శా. ఈలీలావతి దేవి గాఁగొనుజనుండే ధన్యమూర్ధన్యుఁడో
రోలంబాలకి బాలకుండు మునిపుత్త్రుల్ వెంటరానొంటిరా
వైశంబే మొకొ తల్లియుం జనకుఁ డిచ్చామాత్రికివ్వారలో
వాలాయంబుగవచ్చుచున్నయది యవ్వాల్గంటి నింగంటిరే. 114

మ. అనుచుం బౌరులు బారులై నిలిచి యయ్యబ్జాక్షి నీక్షింపన
వ్వనితారత్నము గాంచెఁ గాంచనమణిద్వారస్ఫురద్గోపుర
స్థనదాభీలగభీరభేరిపటహధ్వానప్రతిధ్వానవ
ద్ధ్వని నాదంబగు రాజసౌధము వియద్విస్తారసంరోధమున్. 115

వ. ఇవ్విధంబున శకుంతల రాజమందిరద్వారంబు సొచ్చి యచ్చో విచిత్రరత్నప్రభా రమ్యంబు లగుహర్మ్యంబులం గనుంగొనుచుఁ గక్ష్యాంతరంబులుగడచి యొక్కయెడ విరచితకాంచనపాంచాలికాసంచయోదంచితంబులును, బ్రకటముకురనికురుంబవిడంబితప్రతిబింబశోభాభిరామంబులును, గనత్కనకఖచితమణిప్రభాపటలజటిలంబులు నగువిచిత్రభిత్తిఫలకంబులవలనను సుసంభృతశాతకుంభస్తంభసంభావితవితానంబులవలనను నత్యంతరమణీయంబు నతివిశాలంబును నగుసభాభవనంబునందు వేదవేదాంగవిత్తము లగుభూసురోత్తములును, తర్కమీమాంసాదిశాస్త్రప్రసంగధోరణీపరిణతప్రశంసు లగువిద్వాంసులును, గావ్యనాటకాలంకారనైపుణీనిస్తంద్రు లగుకవీంద్రులును, భాగ్యోదయనిశాంతు లగుసామంతులును, నిజభుజార్గళానర్గళవైఖరీసముద్భటు లగువీరభటులును, మొదలగుసముచితపరివారంబు పరివేష్టింపం గనకకంకణకింకిణీఝణత్కృతియాసంకులంబుగాఁ బంకజముఖు లిరుగెలంకుల వింజామరమ్ములు వీవ సమున్నతరత్నసింహాసనమ్మున నాసీనుండై యున్నయ్యనరేంద్రునిం జూచి భయలజ్జాకలంకితస్వాంతయై యాత్మగతంబున. 116

ఉ. ఈమహనీయమూర్తి సభకేగితిఁ జేరఁగవచ్చుఁ జేరి నే
నేమనిపల్కఁ దానజను లెల్లను నవ్వఁగఁ బూర్వవృత్తమి

ధీమణితో వచించుటకు దీమసమెయ్యది యెట్టులైన నా
హా! మదిగట్టువాపడఁ దులం దొకదానిఁ గనన్ దలంపరే. 117

ఉ. ఇత్తఱిమానియేకతమయే విభుఁ జూడఁదలంతు నేనిప
త్యుత్తమరత్నశోభితసమున్నతసౌధములన్వసించుమ
ద్వృత్తమెఱుంగఁ జేయుటకు నేరి నెఱుంగ నిఁకేమి సేయుదున్
గ్రొత్తలఁ జేరనిత్తురె సరోజముఖుల్ గలరెందఱేనియున్. 118

క. తనలోనని త్తెఱంగున, వనితవితర్కించియిపుడు వసుధాధిపు నె
మ్మనమునఁగల తెఱఁగెఱిఁగెద, నని క్రమ్మఱ నాత్మనిశ్చయము వదలుకొత్తన్. 119

తే. మృదులపవనలీలను వహింసి గదలిపోవు, పాదవుదళుకొత్త మెల్లన నడుగులిడుచుఁ
జనవిభుని చెంత మణిమయస్తంభమొకటి, తనకు నచాటుగా నిల్చెఁ దలిరుఁబోణి. 120

వ. అయ్యవసరంబున. 121

సీ. కనుదోయిగాదిది క్రమ్ముతుమ్మెదగఱుల్, దొరలకుండిన తమ్మివిరులుగాని
మేనుగాదిది వసుభ్రుశ్రీ నూనఁగోయిల, దగరఁగానని మ్రానిచిగురుగాని
మోముగాదిది కళాధామమై యేనాఁడుఁ, బామెఱుంగని చందమామగాని
కెమ్మోవిగాదిది పమ్మినరాచిల్క, పిండుగానని దొండపండుగాని

తే. చెక్కులివిగావు నిద్దంపుఁ జికిలినొప్పి, తద్దయు నెసంగుమించుటద్దములుగాని
దివ్యమోహినియిటకు నే తేరనోపు, ననుచు నీక్షించె నవటిసభ్యవ్రజంబు. 122

క. అప్పుడొకపరి క్రేఁగంటన్, నృపమణి తనుఁ జూచి చూడనివిధంబునఁ దా
విపరీతస్థితినుండినఁ, జపలేక్షణ డెందమందు సందియమందెన్. 123

వ. మఱియు నాత్మగతంబున. 124

తే. అకటకట! చూచి చూడనియటులు పేక్ష, చేయుచున్నాఁడెఱుంగకయో యెఱింగి
యో యెఱుంగనటంచు లోనొదవు శంక, రాజబింబాస్య యమ్మహారాజుఁ జూచి. 125

మ. జగతీవల్లభ! నన్నెఱుంగవె? గజాశ్వస్యందనశ్రేణితో
మృగయాసంగతి నేగుదెంచి పృతనోర్మివ్రాతముండించి యొం
టిగఁ గణ్వాశ్రమభూమిఁ జొచ్చితమిఁ జూడ్కిం జేరి గాంధర్వమిం
పుగ వర్తించుచు నన్వరింపవె? నభోభూదేవతల్ సాక్షిగన్. 126

మ. అపుడేకా విలసత్కటాక్షలలితాస్యశ్రీవిలాసంబుతోఁ
గృపమీఱన్ ననుఁ జూచి వేగఁ దగు వారింబంతు నీ వస్మదీ
యపురీరత్నవిచిత్రహర్మ్యములనుద్యల్లీలఁ గ్రీడింపర
మ్ము పయోజాక్షి! మదగ్రపత్నివని సమ్మోదంబునం బల్కవే? 127

క. నేఁటికి నెవ్వరిఁ బనుపక, నాఁటి వచోరచనమనకు వాటక నన్నా
చ్చోటనె నిలిపితి సుయశగ, పాటవమున నెసఁగు భూమిపతికిది తగునే. 128

క. ఆపలుకులుదుష్యంత, క్ష్మాపాలుఁడువినిహసించిజలజదళాక్షీ !
నీపాడయెఱుఁగనమరిమరి, వాపోవకపొమ్మువున్నువచ్చినత్రోవన్. 129

వ. ఇవ్విధంబున. 130

క. బాలుఁడుతనబాలుండని, బాలామణితనదుధర్మపత్నియనిమహీ
పాలుండెఱిఁగియునెఱుఁగని, వైళంబునఁబలికెలోకవాదచలితుఁడై. 131

వ. ఇవ్విధంబున నారాజముఖి యమ్మహారాజుపలుకునవాదరవచనంబులకు నుల్లంబుజల్లన వెల్లనై వెచ్చనూర్చుచు మున్నీరై తొరంగుకన్నీరుపయ్యెదచెఱంగున నొత్తుచుఁ గటాక్షవీక్షణంబున నారాజునుపలక్షించి మహారాజా ! నీవేలయెఱుంగవెఱింగియునేన కాని యన్యులెఱుంగరని తప్పంద్రోచెదవు ధార్మికులగుమహాపురుషులకు నిట్టిదుర్వృత్తంబు యుక్తంబగునె? పురుషుండు నడచునాచారంబులకువేదంబులును ధర్మంబును సంధ్యయు నంతరాత్మయు యముండును జంద్రసూర్యులును నహోరాత్రంబులును సాక్షులైయుండుటంజేసి నిచ్చలు తన్ను మ్రుచ్చిలసమర్థుండెట్లగు ? నీచేసినతొంటి సమయంబు తప్పి నాయెడ నవజ్ఞసేయఁదగునె? ప్రజావతియుం గుణవతియును సువ్రతయునగుకులసతి నవమానించుట మహాపాతకంబు. అదియునుంగాక ధర్మార్థకామంబుల కుపకరణంబనియును, చారిత్రపరిశీలనంబునకాచార్యకంబనియును, సన్వయస్థితికిమూలంబనియును, సంసారంబునకుఁ గారణంబనియును, హృదయతోషణంబునకుఁ బోషకంబనియును దద్దయుంబెద్దలు భార్యాపరిగ్రహంబుఁ బెద్దచేసెద రట్లగుట నాయెడల ననుగ్రహంబుసేయుట మీకు సర్వార్థసాధకంబు. 132

క. నీపాపండీపాపం, డీపాపనిమ్రోలనద్దమిడికనుఁగొనుమీ
దీపంబునదీపంబభి, రూపంబగునట్లుసదృశరూపుఁడునీకున్. 133

శా. పారుష్యంబులుపల్కనేలనృపతీ! పన్నీరకర్పూరక
ర్పూరస్ఫారపటీరసౌరభపయఃపూరంబుచంద్రాతపం
బారామానిలసేవనంబుమును మీ రశ్రాంతముంగాంతురో
హేరాళంబుగఁబుత్రగాత్రమిళనంబెట్లుండునో చూడుఁడా. 134

చ. అనఘుఁడువాజపేయశతవర్ధిఘటించుమహామహుండుపా
వనచరితుండుశౌర్యనిధివంశకరుండగునీతనూభవుం
డనియశరీరిబాలునుదయంబుతఱిన్వివరించెఁగూర్మిఁగ
న్గొనుమవనీశ! సర్వదమనుండనిపల్కిరివీనిఖేచరుల్. 135

క. పట్టపుదేవింగాఁజే, పట్టుదునినుఁదనయురాజ్యభారవహుంగాఁ
బట్టముగట్టుదుననివనిఁ, బట్టుపఱుచునాఁటిసత్యపథమెడలకుమీ. 136

సీ. విమలంబులైనకూపములునూఱిటికంటెఁ, బరికింపనొకనడబావిమేలు
హవణిచేసినబావులరయనూఱిటికంటెఁ, గణుతింపనొక్కసత్క్రతువుమేలు

ఘనతమమైనట్టి యాగములు నూటికంటె, సుగుణాఢ్యుఁడగు నొక్కసుతుఁడు మేలు
సుగుణాఢ్యులగునట్టి సుతులు నూర్వురకంటె, సనినొక్క సత్యభాషణము మేలు
తే. నానృతాత్పాతకంపరమనుచు వినుచు, వేదవాదుల వచనంబు వినవొ మున్ను
వినియు మఱచితివో కాక వేడబమున, నేఁచఁదలఁచితివో ధారుణీశ! నన్ను. 137

ఆ. సత్యమశ్వమేధశతముఁ ద్రాసునఁ బెట్టి, తూన్పముల్లు సూపెఁ దులకు సత్య
మట్టి సత్యమునకు నఖిలవేదంబులు, సకలధర్మములును సాటిరావు. 138

క. కావున సత్యము గుఱిగా, భావింపుము యౌవరాజ్యపట్టస్ఫుటల
క్ష్మీవిలసితుఁ గావింపుము, గావింపఁగ ధర్మపత్నిగా ననుఁ గనుమీ. 139

క. మేనకకుం గౌశికునకు, నేనుదయించితిని గణ్వునింటఁ బెరిగితిన్
మానవనాయక యనృతవి, ధానంబు ఘటింపవంతె ధర్మేతర నే. 140

వ. అని బహుప్రకారంబులం బ్రార్థించు నమ్మంజుభాషిణి సంభాషణంబులు సత్యంబులని తోఁ
చియు నపురావిదులగుట సభాసదులెద్దియుం దోఁచక మిన్నకుండి రమ్మానవపతి యమ్మానవతి
సంప్రార్థనంబుఁ బెడచెవులం బెట్టి వెండియు నిట్లనియె. 141

క. ఎక్కడి సుతుఁ డెక్కడి నీ, వెక్కటి నేనన్నృతవాద మేటికిఁ గలికీ
చక్కఁదనంబున మత్సము, నొక్కని నెదురొడ్డి పలుకు టుచితమె నీకున్. 142

వ. అనిన నద్దేవి నిట్టూర్పు నిగిడించుచుం గొండొకదడవూరకుండి క్రోధారుణంబులగు కటా
క్షంబుల నమ్మహీపతి నెమ్మోముఁ జూచుచుం జూచుచు గాంధర్వవివాహంబున నం బరిగ్రహిం
చునప్పటిపలుకు లుగ్గడించి కపటధార్మిక యప్పుడప్పాటనొప్పం జెప్పి యిప్పు డిప్పగిదిఁ
దప్పం ద్రోచిన నా నోఁచిన నోము సఫలంబు గాఁగలదే నీ యడిగిన సాక్షులు సాక్షాత్కరింప
కుండుదురే యని యెలుంగు రాల్పడం బలికి యక్కలికి కనుఁగొలంకులం జారు బాష్పజల
పూరంబుఁ గరతలంబులనొత్తికొనుచు నృపసన్నిధానంబున నిలువను మరలిపోవనుం దోఁపక
యాత్మగతంబునఁ గొండొక వితర్కించి లోకసాక్షియగు పుండరీకాక్షుండు దక్కం
దక్కొరులిక్కొఱఁతఁ దీర్పంజాలరని తలఁచి శ్రీహరి నుద్దేశించి యిట్లని వినుతించె.

శా. శ్రీభూనీళలతోఁ బరాత్పరతరా జిల్లం జతుర్వ్యూహివై
శోభిల్లన్ విభవావతారముల మెచ్చుల్ గూర్ప సర్వాంతరం
గాభోగంబు వహింపఁ బూజనల నుద్యన్మూర్తి వర్తింపనీ
సౌభాగ్యంబు బుధైకభోగ్యత మహాసత్యంబు నారాయణా. 144

క. కరిణీనాథునిఁ గాచిన, కరుణావరుణాలయుఁడవు గావున యుష్మ
చ్చరణారుణాంబురుహముల, శరణము వేఁడితిని సర్వసాక్షివధీశా. 145

శా. పుట్టం బుట్టఁగఁ గల్లి దండ్రులడవిన్ బోఁ ద్రోచిరీ వైఖరిన్
బొట్టం గట్టిన ప్రాణనాయకుఁడు పోపొమ్మంచు నో నాడెడిన్

గట్టా కోయిలపిల్ల చందమున బల్గాసి న్వాఅంగొంటిన
న్నిట్టట్టుం గికురింపఁ జూచెద వొకొ యయ్యాలింపవే శ్రీహరీ. 146

సీ. పురుడు దీఱకమున్న పూపప్రాయపు దానిఁ, గావలోఁ ద్రోచిరి కన్నవారు
కోరి కూడిన భర్తఁ జేరుమింతనటంచు, గొడఁగి పంచిరి పెంచుకొన్నవారు
నీ వేడ నే నేడఁ ద్రోవవట్టుమటంచు, మన్నింపరై రేలుకొన్నవారు
పాపపుణ్యములేఱుపఱిచి చెప్పఁగలేక, మిన్నకుండిరి చుట్టమున్నవారు
తే. సాక్షిగా మిమ్ము రూపించి జనవిభుండు, నట్టడవిలోన నన్నట్టుపట్టుపఱిచి
వెడలి పొమ్మనుచున్నాఁడు వేడబమున, నశరణశరణ్య యాలింపు మాఁడు కుయులు. 147

వ. అని యివ్విధంబున ప్రార్థించు నమ్మించుఁబోఁడి యులమటఁ దీర్పం దలంచి. 148

మ. ఫలదుండై తగు పార్వతీరమణుఁడున్ భాషావధూనాథుఁడున్
బలభిద్వహ్ని ముఖాఖిలామరవరుల్ పార్శ్వంబులం జుట్టిరా
లలదుత్తుంగపతంగరాజరథుఁడై లక్ష్మీసమేతంబుగా
జలజాక్షుండు శకుంతలావశగుఁడై సాక్షాత్కరించెన్ రహిన్. 149

వ. ఇత్తెఱంగున నమ్మత్తకాశిని సత్యంబునకుం బాతివ్రత్యంబునకు మెచ్చి యచ్చెరుపాటున
వియచ్చరులు పొగడు కలకలం బాలించుచు నీశుండును వాగీశుండును లోనుగాఁగ
దివ్యపురుషులు సాంగసాయుధ సపరివారంబుగా నలుగెలంకులం బలసి నిలువ శ్రీభూ
నీళాసమేతంబుగా గరుడవాహనారూఢుండై కిరీటకటక గ్రైవేయకేయూర కాంచీ
ముఖభూషణస్థగిత మణికిరణ ప్రభాజాలంబు నలుగడలం గడలుకొన నద్దేవదేవుండు
సాక్షాత్కరించినం గాంచి సామంత మంత్రి పురోహిత ప్రముఖ పరివారసహితంబుగా దిగ్గన
లేచి దండప్రణామంబు లాచరించి ముకుళితకరకమలుండై యెద్దియుం బలుక నేరక
మిన్నకున్నం గని యాపన్నశరణ్యుం డగు నప్పన్నగశయానుండు నరనాథుని ముఖంబునఁ
గరుణాతరంగితంబులగు నిజకటాక్షవీక్షణంబులోలయ మృదుమధురగంభీరస్వనంబున
నిట్లనియె. 150

శా. సత్సంతానఫలామరద్రుమము సంసారక్రియామూలమా
పత్సంపత్సదృశావలంబనము సౌభాగ్యాలవాలమ్ముని
త్యోత్సాహంబుల పట్టుఁగొమ్మసుకృతోద్యోగానుసంధానమో
వత్సా యిట్టిపతివ్రతాతిలకమున్ వంచించెదే బేలవై. 151

ఆ. నీమనోరథంబు నెఱవేర్చిపిదపనీ, సేమమరయఁగోరి కోమలాంగి
బాలుతోడ నిన్నుఁ బ్రాపింపవచ్చిన, నవగణింపఁదగునె యవనినాథ. 152

సీ. అభినవస్వర్గక్రియారంభమున నుగ్ర, దీక్షఁ గావించు గాధిజుఁడు తండ్రి
లోకోపకారార్థమా కౌశికునితపస్థితి మాన్పు మేనకాదేవి తల్లి

భూతలమ్మున నూర్ధ్వరేతుఁడై తగు కాశ్యపుఁడు భయత్రాత యుఁబోషకుండు
చిత్రవిచిత్రసృష్టికళాధురీణుఁడై, తగుకశ్యపబ్రహ్మ తండ్రితండ్రి
తే. యనుమగాఁ జూడఁగూడదీయతివయతివ, శాక్రమంబున నీక్రమంబపనయింపఁ
గలిగెనీ చక్రవర్తిలక్షణముఁ దాల్చు, బాలుఁ డష్టాదశద్వీపపాలకుండు. 153

వ. అనుచు దుష్యంతమహీకాంతునకు నాజ్ఞాపించి యానందకందళితహృదయారవింద
రై యున్న శకుంతల ననునయించుచు నద్దేవదేవుం డిట్లని యానతిచ్చె 154

తే. మానినీలమహీపాలమౌళియుత్త, గణితవృత్తరవంతసద్గుణనిశాంత
పరఁగ దుష్యంతభూభర్త భర్త నీకు, భయ మెడలుచుమ్మ నీకేమి భాగ్యవతివి 155

వ. అనియిట్లు సజలజలధరగంభీరమధురఘోషంబుతో సంతోషింపం జేయు నత్తోయ
జాక్షు నుపలక్షించి సవినయంబుగా దుష్యంతుం డిట్లని వినుతించె. 156

దండకము. శ్రీమద్రమావిద్రుమోష్ఠీసమారూఢవక్షా శమారూపితాక్షా సమీచీనవీక్షానిమీల ద్విపక్షా వనత్రాణదక్షా పయోజాతజాతాండతండోదయస్థేమభంగాదిలీలావిచిత్రా నిరాలంబచిత్రా మరున్నీలగాత్రా సరోజాతనేత్రా ధరిత్రీకళత్రా హితానందమూలా శతానందఖేలా సహస్రారహస్తా బహుస్ఫారశస్త్రా యవండంబులండంబులండంబులున్ వస్తుకాండంబు యవ్యద్గళాంశోత్తరావారముల్ యద్గుణంబుల్ ప్రధానంబునం బూరుషుండున్ ద్రిపాద్భూతియున్ యత్పరబ్రహ్మమున్ యుష్మదంశాంశలేశప్రతిష్ఠాగరిష్ఠంబులం మన్ త్రయీతత్వనాముల్ ప్రబోధింతు రీశా పృథివ్యాదులం గార్యముల్ కారణస్థానమున్ జేసి సంహారకేళీకళాశాలివై హారిభూతప్రపంచంబులోఁ గొంచు సవ్యాకృతిన్ శుద్ధసత్వావృతిం గూడి క్రీడించుమున్ ప్రస్తరిన్ విస్తరింపన్ యదృచ్ఛానియుక్తింపదచ్ఛాభబలజ్ఞానశక్తిత్రయిన్ జాట్కులన్నింపఁ బెంపై యసన్నామరూపప్రసక్తిన్ మహత్తై యహంకారమై పంచతన్మాత్రమై పంచభూతంబులై దేవతిర్యఙ్మనుష్యాదికవ్యక్తులై వస్తులన్ జాలసన్నం గృపం జీవులన్ తావులం జేర్చి పాలార్చియందుం బరేశుండవై ప్రోచుమున్ వ్యూహభేదంబులం గాంచుమున్ దివ్యలీలావతారంబులం దీర్చుచుం బ్రాఁతిమైయంతరాత్మస్వరూపంబునం జేర్చుచుం బొంగి శ్రీరంగకాంచీజగన్నాథశేషాచలాది ప్రతిష్ఠాని దేశంబు నాదివ్యదేశంబులన్ భక్తవారంబులన్ సంతతానందపూరంబులం దేల్చు ధీరుండ వివేకదా ఘోరమానీరధిం జోరవైతూాతి వేదాపహారిన్ విదారింపవా, పేర్మిమైఁ గూర్మమై కూర్మిమై యొప్పులన్ మెప్పులన్ నొప్పఁ గాసుందరామందరాగంబునన్ మందరాగంబుఁ బెన్ గోపునన్ మాపునం దాల్పవా, క్రీడమై క్రోడరూపంబునం బ్రోడవై యాహిరణ్యాక్షుపై నోహరిన్ సాహరిన్ దూఱుచున్ దారుచున్ బోరుచున్ జీరిచెండాడవా, భైరవంబౌనృకంఠీరవంబై భుజాగౌరవంబున్ నిజోగ్రారవంబుం దివంబెల్ల ఘూర్ణిల్లఁ జేయన్ బయోజాతభూజాతభూరిప్రభాఖర్వగర్వోదయా జేయుదైతేయు ముంగోరులం జేమరమ్మున్ వడిన్ జీరి గారించి ప్రహ్లాదు

సాహ్లాదుఁ గావింపవా! గుజ్జవై వెజ్జవై హజ్జనిమ్ముజ్జగంబుజ్జగింపన్ బలిన్ వేఁడవా! జామద
గ్న్యుండవై ఘోరధారాసముద్యత్కుఠారంబుచేఁ బూనియుద్యోదుమాలుల్ మహాక్రో
ధులన్ ధారుణీనాథులంగూల్చుచున్ సాధులన్ వైభవామోదులం జేయవా! రామరూపం
బునన్ భీమకోపంబునన్ లోకవిద్రావణున్ రావణున్ ధాటిచేఁ గీటణంగింతువంచున్,
మహింగామపాలుండవై శ్యామచేలుండవై సామలోలుండవై భీమశీలుండవై శత్రుహా
లాహలంబున్ లలింబూని పోరం బ్రలంబాదులన్ మేదినింగూల్తువంచున్, సురత్వ
న్నఖప్రార్థనాబద్ధరోషంబునన్ బుద్ధవేషంబునన్ దానవస్త్రీనవామోదసంధాయివై దేవతా
జీవితంబుల్ ధృతింగాతువంచున్, కలింగల్కిభావంబునన్ బల్ రవాల్గుట్టిపుస్నేటిరాహు
త్తవై హత్తిదుర్వృత్తులౌ మత్తులన్ గుత్తుకల్ గత్తివ్రేత్తుగన్ గోసిబాహాలసద్ధారణీ ధా
రుణిన్ బ్రోతువంచున్, బురాణంబులున్ శాస్త్రముల్ వేదముల్ వేదశీర్షంబులున్ బ
లుక్కనంమన్ మహాయోగివర్యుల్ రుచింపన్ వచింపన్ వినంగాంతునబ్జోదరా సంవిదే
కాంతమై యాద్యమై హృద్యమై భవ్యమై దివ్యమై యోగమాగమ్యమై సౌమ్యమై నిర్మ
లంబై నిరాకారమై సారమై శుద్ధమై బుద్ధమై నిష్కలంబై జయంబై నిజంబౌ భవద్దివ్య
తేజం బిళాపింగళామధ్యవీథిన్నిరోధించి భావించి సేవింతుధీరుల్ గదానిత్యమూరుల్
సదానంద గోవింద మావిందవై యిందిరాదేవితో నందిరా శేవిశో నిందురా నిప్పుదుర్వింది
రంబై కదున్ సుందరంబయ్యె మద్గోత్రమున్ బాత్రమయ్యెన్ మదాచారమున్ సం
తతోగారమయ్యెన్ గృతార్థుండనైతిన్ ద్రయీతత్త్వపారాయణా యాదినారాయ
ణా దేవతుభ్యన్నమస్తే నమస్తే నమః. 157

వ. అని యనేకప్రకారంబుల వినుతించి వెండియు ని ట్లనియె. 158

శా. దేవా కాశ్యపు నాశ్రమంబునకు నర్థింబోవనీ లేమతో
దైవంబున్ బెరరేఁపఁ గానొదవె గాంధర్వక్రమోద్వాహమీ
భానంబన్యు లెఱుంగమిన్ వెలిచితిన్ బాలామణిన్ గైకోఁన్
నావృత్తాంతము నేనెఱుంగనఁట వేనాళీకపత్రేక్షణా. 159

ఉ. ఏనిక లేనికట్లభయమిచ్చితిరిచ్చలు నిచ్చలున్ బర
ధ్యానపరాయణుండనక తావకపాద పయోజ యుగ్మమి
మ్మానినిసాక్షిగా నొడివిమత్సహచారిణియయ్యె నయ్యెడన్
దీనశరణ్య మీరలయదెంటుటచిత్రమె తత్రసాక్షివై. 160

క. మెచ్చితిరాత్మన్ సాక్షికి, నచ్చితిరిందుల జనాపవాదము దీఱన్
దెచ్చితిరి మాకువిశ్రుతి, నిచ్చితిరభయప్రదానమిమ్మానినికిన్. 161

వ. ఇత్తెఱంగున హరినుద్దేశించి పలుకుచు సగౌరవంబుగా శకుంతలం గలిపికొని శ్రీభూ
నీళాసహితుం డగునద్దేవదేవునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి. 162

ఉ. దండము పార్వతీపతికి దండము వాగ్రమణీవినోదికిన్
దండము వాసవాగ్నియమ దానవముఖ్యదిగీశరాజికిన్
దండము నారదాదులకు దండము చారణసిద్ధకోటికిన్
దండమటంచు దేవియును దానును మ్రొక్కెను దేవతాళికిన్. 163

వ. ఇవ్విధంబున నవ్వధూవరులు హరిహరవిరించిబృందారకమునిబృందారకబృందంబులకుం గ్రమంబున వందనంబులాచరించి సవినయంబుగా భరతుని మ్రొక్కించిన నక్కుమారుండును విష్ణుదేవునకుం బ్రణమిల్లి పశుపతికిం బ్రణిపాతంబు గావించి చతురాననునకు దండప్రణామంబాచరించి యింద్రాది దిక్పాలురకుం జోహారు గావించి నారదాది మహామునులకు నమస్కరించిన నద్దేవదేవుం డక్కుమారకంఠీరవు గాంభీర్యధైర్యౌదార్యాదివిశేషంబులకు మెచ్చి శకుంతలాదుష్యంతులం గాంచి యితండు వాజపేయాధ్వరశతంబుఁ గావించి యష్టాదశద్వీపంబులం దనశాసనంబు నిరర్గళంబుగా వర్తిలం జేయుచు వంశకర్తయై కీర్తిపౌరుషంబులు సంపాదింపంగలవాఁడని యాదేశించి కరుణాతరంగితకటాక్షవీక్షణంబులం గృతార్థులం గావించి యంతి నయ్యనంతుండు సపరివారంబుగా నంతర్ధానంబుచేసె నయ్యవసరంబున. 164

క. ఆడిరి రంభాదులు రహిఁ, బాడిరి గానంబు నూనఫణితిన్ ఖచరుల్
వీడిరి ఖేదము పౌరులు, కూడిరి దుష్యంతుఁడును శకుంతలయున్ ధృతిన్. 165

వ. ఇవ్విధంబున దుష్యంతుండును శకుంతలాసమేతుఁడై కుమారునకు యౌవరాజ్యపట్టాభిషేకోత్సవంబు నిర్వర్తించి బ్రాహ్మణులకు నానావిధమహార్హవస్తుప్రదానంబులం దనిపి మహోన్నతవిభవంబున శకుంతలయుం దానును యథేష్టభోగంబులఁ దనరుచు రాజ్యంబు పాలించుచుండె నని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పె వెండియు నిట్లనియె

## ఫలశ్రుతి.

సీ. ధర్మార్థులకు భూరిధర్మప్రదంబగు, నర్థార్థులకు నగు నర్థదంబు
కామార్థులకు దివ్యకామప్రదంబగు, మోక్షార్థులకు నగు మోక్షదంబు
పరిణయార్థులకును బరిణయప్రదమగుఁ, బుత్త్రార్థులకు నగుఁ బుత్త్రదంబు
సంపదర్థులకును సంపత్ప్రదంబగు, విజయార్థులకు నగు విజయకరము
తే. వేడ్కఁ జదివిన వ్రాసిన వినిన యట్టి, ఘనులకఖిలార్థలాభంబు గలుగుచుండు
నవనివాచంద్రతారార్కమలఘుకీర్తిఁ, బరఁగవిల్లు శకుంతలాపరిణయంబు. 167
తే. అని శకుంతలాకల్యాణమనువు మీఱ, మౌనివరుండు చెప్పిన మనుజవిభుఁడు
వీనులారంగ వినుచుండి విస్మయమునఁ, బొంగి సంతోషభరితాంతరంగుఁడయ్యె. 168

## ఆశ్వాసాంతము.

చ. హరిహరివాగవాగపశతారకతారకతారతారకా
శరశరదిందుకుందహరిచందనచందనభారభారతీ

పరపరవాజివాజిరథవాసభవాసమృణాళనాళవి
స్తరతరకీర్తికీర్తితసదానసదావనవేంకటేశ్వరా. 169

భుజంగప్రయాతము.—

కృపాధారదాసేరకృష్ణార్తిదూరా, విపశ్చిజ్జనారాధ్య వేదాంతబోధ్యా
కపాలిస్తుతిస్తోమకల్యాణధామా, రిపుధ్వాంతఘస్రేశ శ్రీ వేంకటేశా. 170

గద్య. ఇది శ్రీమత్కౌసల్యానందనప్రసాద సమాసాదితకవితా విచిత్ర మైత్రేయసగోత్ర నృసింహగురుపుత్ర కృష్ణకవిప్రణీతం బైన శకుంతలాపరిణయం బను మహాప్రబంధంబు నందు శకుంతలాదుష్యంతసంవాదంబును శ్రీవిష్ణుసాక్షాత్కారంబును శ్రీవిష్ణుసంకీర్తనంబును భరతయావరాజ్యపట్టాభిషేకంబును శకుంతలాదుష్యంతపునస్సంభోగోపాఖ్యానంబు ననుకథలంగలసర్వంబును దృతీయాశ్వాసము.

శకుంతలాపరిణయము

సమాప్తము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రితము—1916.

# ఆంధ్ర గ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రభారతము— | | |
| ఆది, సభాపర్వములుగల సంపుటము ,, ... | 1 | 12 |
| అరణ్యపర్వముగలసంపుటము ,, ... | 1 | 12 |
| విరాటోద్యోగపర్వములుగలసంపుటము,, ... | 1 | 12 |
| శాంతిపర్వము ,, ,, ... | 1 | 12 |
| ఆదిపంచకము, ఒక్కటేసంపుటము ,, ... | 5 | 0 |
| ఆంధ్రభారత విమర్శనము ... | 0 | 8 |
| (గ్రంథము 7 సంపుటములలో పూర్తియగును.) | | |
| లంకావిజయము, సటీక ... | 1 | 8 |
| కృష్ణరాయవిజయము, కుమార.ధూర్జటి ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు ... | 2 | 8 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | 1 | 8 |
| అచ్చతెనుఁగురామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనికూర్పు ... | 2 | 8 |
| గోపీనాథరామాయణము, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యకావ్యము | 4 | 8 |
| మొల్లరామాయణము, చిన్నపైజాన పెద్దక్షరములతో చక్కఁగముద్రితము | 0 | 8 |
| వసుచరిత్ర విమర్శనము, అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకములిందుగలవు. | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము ... | 2 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... | 1 | 8 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది ... | 0 | 10 |
| కాశీఖండము ,, ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది ... | 3 | 0 |
| డిటో మేలుప్రతి, చక్కనిబైండు ... | 4 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి ... | 5 | 8 |
| వీరభద్రవిజయము, బమ్మెర. పోతనామాత్యప్రణీతము ... | 0 | 12 |
| మనుచరిత్ర, సటీక ... | 1 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆముక్తమాల్యద, సటీక, చక్కనిప్రతి ... | 3 | 0 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 8 |
| విజయవిలాసము, చేమకూర. వేంకటకవి ... | 0 | 4 |
| హరవిలాసము, శ్రీనాథకవిది ... | 0 | 10 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, ... | 0 | 8 |
| రంగరాయచరిత్ర, దిట్టకవి. నారాయణకవిప్రణీతము ... | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్రకవికృతము ... | 1 | 8 |
| లీలాసుందరీపరిణయము, కూచిమంచి. తిమ్మకవికృతము ... | 0 | 8 |
| రసికజనమనోభిరామము, శుద్ధప్రతి ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము ,, ... | 0 | 8 |
| రాజశేఖరవిలాసము, కూచిమంచి. తిమ్మకవిది ... | 0 | 6 |
| పారిజాతాపహరణము ... | 0 | 6 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము ... | 0 | 8 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ. వెంకమ్మప్రణీతము, చక్కనికూర్పు | 0 | 14 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| సారంగధరచరిత్ర, చేమకూర. వేంకటకవికృతము ... | 0 | 8 |
| నిరంకుశోపాఖ్యానము ... | 0 | 6 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 10 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడ ... | 0 | 12 |
| ఉత్తరహరివంశము, సోమనాథకృతము ... | 1 | 4 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 8 |
| సులక్షణసారము, సటీక ... | 0 | 8 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము ... | 4 | 0 |
| దసరాపద్యములు ... | 0 | 1 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము, కాలికోబైండు | 0 | 12 |
| అప్పకవీయము, చక్కనికూర్పు, అట్టబైండు ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు ... | 1 | 10 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథకృతము ... | 2 | 0 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు ... | 0 | 4 |
| దిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో ... | 1 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మాతృశతకము ... | 0 | 1 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు ... | 1 | 0 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 4 |
| డిటో ,, గట్టుప్రభువుకృతము ... | 0 | 6 |
| సుమతిశతకము, సటీక ... | 0 | 2 |
| కుమారీశతకము ,, ... | 0 | 2 |
| దాశరథిశతకము ,, ... | 0 | 4 |
| మానసబోధశతకము ,, ... | 0 | 2 |
| భాస్కరశతకము ,, ... | 0 | 3 |
| కలువాయిశతకము ... | 0 | 2 |
| జకన్నాయకశతకము ... | 0 | 2 |
| కవిచౌడప్పశతకము ... | 0 | 2 |
| నృసింహశతకము ... | 0 | 2 |
| చంద్రశేఖరశతకము ... | 0 | 1 |
| రామలింగేశశతకము, అడిదము. సూరకవిది ... | 0 | 2 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవిది ... | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము, కూచిమంచి. తిమ్మకవిది ... | 0 | 2 |
| దేవకీనందనశతకము ... | 0 | 2 |
| కృష్ణశతకము ... | 0 | 2 |
| నారాయణశతకము ... | 0 | 2 |
| కాళహస్తిశతకము ('సాంబశివా మహాప్రభో') ... | 0 | 2 |
| సింహాద్రినారసింహశతకము ... | 0 | 2 |
| భద్రాద్రిరామశతకము, పావులూరి. మల్లనకృతము ... | 0 | 2 |
| ప్రసన్నరాఘవశతకము ... | 0 | 2 |
| చిత్తబోధశతకము ... | 0 | 3 |
| భోగినీదండకము, బమ్మెర. పోతరాజప్రణీతము ... | 0 | 1 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు ... | 0 | 6 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి ... | 0 | 6 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద ... | 0 | 14 |
| రూపలి, రాజపుత్రస్త్రీసాహసపుకథ, శ్రీ ఎనమండ్ర. నారాయణమూర్తిగారిది | 0 | 8 |
| శ్రీనాథునిపీఠనాటకము ... | 0 | 2 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| కన్యాశుల్కము, శ్రీగురజాడ. అప్పారాయకృతము ... | 0 | 12 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| కృష్ణాకుమారినాటకము, శ్రీసీతారామకవిగారిది | ... | 0 | 12 |

## వచనకావ్యము

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, 3 సంపుటములు | ... | 7 | 8 |
| సంగ్రహరామాయణము, సులభశైలి, శ్రీ శేషాద్రిశర్మకృతము | ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము, సులభశైలి | ... | 0 | 12 |
| దశకుమారచరిత్రము, శ్రీ ఎనముచింతల. సంజీవరాయశాస్త్రికృతము | ... | 1 | 4 |
| శివాజీచరిత్ర | ... | 0 | 6 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | ... | 0 | 2 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్ర | ... | 0 | 2 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 2 |
| దాదాభాయినౌరోజీచరిత్ర ,, | ... | 0 | 1 |
| అనిబిసెంటుచరిత్ర ,, | ... | 0 | 1 |
| వివేకానందస్వామి జీవితము, ప్రతిమతో | ... | 0 | 1 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ,, | ... | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము | ... | 0 | 2 |
| సూరతుకాంగ్రెస్సుఉపన్యాసములు | ... | 0 | 2 |
| శ్రీగైక్వారుగారి ఉపన్యాసములు | ... | 0 | 2 |
| శాలివాహనచరిత్ర | ... | 0 | 2 |
| శ్రీబుద్ధచరిత్రము | ... | 0 | 4 |
| సోదరినివేదితజీవితము | ... | 0 | 2 |
| లార్డుక్లైవు జీవితము | ... | 0 | 6 |
| దక్కనుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | ... | 1 | 4 |
| మర్యాదరామన్నకథలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 3 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 4 |
| చేముక్కపగటిముక్కకథలు | ... | 0 | 2 |
| మైరావణచరిత్ర | ... | 0 | 2 |
| ఈసబునీతికథలు, క్రొత్తకూర్పు 1-వ భాగము | ... | 0 | 6 |
| ,, ,, 2-వ భాగము | ... | 0 | 8 |
| షేక్స్పియర్ నాటకకథలు, సులభశైలి | ... | 1 | 4 |
| అరేబియన్ నైట్సుకథలు, చక్కనికూర్పు | ... | 1 | 4 |
| శ్రీగురుజాడ. శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | ... | 2 | 8 |
| తారాభాయి, చక్కనినవల | ... | 0 | 12 |
| ఆనందమఠ, నవల, నూతనముద్రితము | ... | 0 | 12 |

| | | | ప్రతి 1 కి-రూ. | అ. |
|---|---|---|---|---|
| ఐవన్హో, నవల | | ... | 0 | 6 |
| మదాలస ,, | | ... | 0 | 10 |
| టిప్పుసుల్తాన్, నూతనకవితాశైలిని. శ్రీ ఉమాకాంతముగారిచేవిరచితము | | | 1 | 4 |
| సీతారామము, శ్రీతల్లాప్రగడ. సూర్యనారాయణరావుగారిది | | ... | 1 | 0 |
| ఉన్మాదిని, నవల | | ... | 0 | 4 |
| రాధారాణి ,, | | ... | 0 | 4 |
| దుర్గేశనందిని, నవల | | ... | 0 | 10 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది, చిన్నసైజు | ,, | ... | 0 | 6 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ,, | ... | 0 | 6 |
| రామదాసచరిత్ర, చక్కనికూర్పు, మంచికాగితములు, ఇంకా శ్రీరామదాసుగారి ప్రతిమకూడకలదు | ,, | ... | 0 | 8 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక, శుద్ధప్రతి | ,, | ... | 0 | 6 |
| ఆంధ్రభాషాభూషణము | ,, | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, చక్కనికూర్పు | ,, | ... | 0 | 12 |
| ఆంధ్రచంద్రాలోకము, సటిప్పణము | ,, | ... | 0 | 6 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది | ,, | ... | 0 | 12 |
| ప్రౌఢవ్యాకరణము, శ్రీసీతారామాచార్యకృతము | ,, | ... | 0 | 12 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు, చక్కనిప్రతి, చిన్నసైజు | | ... | 0 | 6 |
| అద్వైతసంగ్రహము, వచనము | | ... | 0 | 2 |
| వాసుదేవమననము, వచనము, చక్కనికూర్పు | | ... | 0 | 14 |
| శబ్దార్థచంద్రిక, అకారాది ఆంధ్రనిఘంటువు | | ... | 2 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

192, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

| | | | ప్రతి 1 కి-రూ. | అ. |
|---|---|---|---|---|
| ఐవన్హో, నవల | | ... | 0 | 6 |
| మదాలస ,, | | ... | 0 | 10 |
| టిప్పుసుల్తాన్, నూతనకవితాశైలిని. శ్రీ ఉమాకాంతముగారిచే విరచితము | | | 1 | 4 |
| సీతారామము, శ్రీతల్లాప్రగడ. సూర్యనారాయణరావుగారిది | | ... | 1 | 0 |
| ఉన్మాదిని, నవల | | ... | 0 | 4 |
| రాధారాణి ,, | | ... | 0 | 4 |
| దుర్గేశనందని, నవల | | ... | 0 | 10 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది, చిన్నసైజు | ,, | ... | 0 | 6 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ,, | ... | 0 | 6 |
| రామదాసచరిత్ర, చక్కనికూర్పు, సుందికాగితములు, ఇంకా శ్రీరామదాసుగారి ప్రతిమగూడకలదు | ,, | ... | 0 | 8 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక, శుద్ధప్రతి | ,, | ... | 0 | 6 |
| ఆంధ్రభాషాభూషణము | ,, | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, చక్కనికూర్పు | ,, | ... | 0 | 12 |
| ఆంధ్రచంద్రాలోకము, సటిప్పణము | ,, | ... | 0 | 6 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది | ,, | ... | 0 | 12 |
| ప్రౌఢవ్యాకరణము శ్రీసీతారామాచార్యకృతము | ,, | ... | 0 | 12 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు, చక్కనిప్రతి, చిన్నసైజు | | ... | 0 | 6 |
| అద్వైతసంగ్రహము, వచనము | | ... | 0 | 2 |
| వాసుదేవమననము, వచనము, చక్కనికూర్పు | | ... | 0 | 14 |
| శబ్దార్థచంద్రిక, అకారాది ఆంధ్రనిఘంటువు | | ... | 2 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

192, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.